<> ఏడురూపాయలకే -- ఏడంతస్తుల మేడ <> ..

ఒకానొకనాడు - ఒకానొక వూరిలో - తనకున్న ఒక్క గా నొక్క దేవాలయాన్ని చూసి సంతోషించుకుందారి అని బ్రహ్మదేవుడు వస్తూ వున్నాడు . వస్తున్న న్న దారిలో ని ఒక శిథిల గృహం నుండి కమ్మని "పప్పుచారు" వాసన రావటం వల్ల ఆయన ఆఇంటి వద్ద ఆగి "ఎవరీఅదృష్ట గృహస్థు? " అనుకుంటూ - గోడలోనుండి లోపలి కి చూసాడు . అక్కడ ఒక డు విస్తరి ముందుభోజనానికి అని కూచొని , అన్న మో రామచంద్రా అన్నట్లు భార్యవంక చూస్తూ వున్నాడు . . ఆమె కట్టెల మంటతో పప్పు చారు ఉడికించుతూ " " దోరికాడురా- మిడతంబొట్లు " అన్నట్లు భర్త వంక చూస్తూ - పొయ్యిలో ని మంటను , తన మనస్సులోని కోపాన్ని ఎగతోసుకుంటూ వున్నది .

కావాలని వంటను జాప్యం చేస్తూ ఉంది

బ్రహ్మ మోగా మా నిషి ఎవరో బ్రహ్మ తృటిలోనే గుర్తు పట్టాడు . అతడు . బ్రహ్మ దేవుని గుడి యొక్క పూలారి. బ్రహ్మ అంతటివాడు" పూజారి "అన్న మాటకు బదులు" పూలారి"అన్న మాట వాడాడని అనుకోలేము.

రాజులచే ,నిత్యమూ గుడిలో పూజకు ఏర్పాటు చేయబడిన మనిషి పూజారి అయినట్లు ఒక రాజు ఒక్క ఆజ్ఞతో , ప్రతి నిత్యము కొలనునుండి ఒక బ్రహ్మ కమలాన్నితీసుకు వచ్చి బ్రహ్మకు సమర్పించ వలసిన భాద్యత నెత్తిన పఢ్డ ఈ వ్యక్తి పూలారి అయినాడు .

పూర్వము ఎప్పుడో ఒక గొప్ప రాజు, ఎదో అవసరాతో బ్రహ్మ తో కూడిన సరస్వతి యొక్క - ఒక ఆలయము , దాని పక్కనే ఒక కొలను నిర్మించి అందులో బ్రహ్మకమలాలను పెంచింప చేసాడు . ప్రతి ఉదయము కొన్ని కలువపూవును తెంపి బ్రహ్మకు సమర్పించే దానికి అని ఒక మనిషిని పెట్టాడు . ఆపని చేయు మనిషియేమన పులారి .

పులారి తన పని చేసినందుకు గాను మొదటిరతరపు రాజు ఇతనికి నెలకు అర్ధరూపాయ జీతము - ఫది ఎకరాల మాగాణి భూమీ ఏర్పాటు చేశాడు . రాజులలో మూడో తరము వచ్చేసరికల్లా బ్రహ్మ గుడి రాజు సంతతి యొక్క ఆదరణ కోల్పోయింది . అర్ధరూపాయి జీతము అనేది - పైసాకు బస్తా బియ్యము లభించే రోజులలో ఇచ్చిన జీతము .నేడు రాజులలో ఏడవతరము జరుగుతూ వున్నది . మనవాడు కూడా పూలారులలో ఏడవతరపు వాడు ;

నేడు పులారికి ఆ యాభై పైసలు కూడారావటం లేదు . ఫది ఎకరాల మాగాణి - కరణాలు వేసిన మంత్రాల వల్ల కుచించుకొని పోయి నేటికీ ముప్పావు ఎకరం అయ్యింది . ఈ పొలం మీదవచ్చే గింజలు - యాచక వృత్తిలో వచ్చే పైసలు మన వాడైన పులారికి జీవన ఆధారము .ఎప్పుడో శతాబ్దాల క్రింద రాజులు కట్టించి ఇచ్చిన గృహమే నేటికీ అతని నివాసము .

<<>>"భార్య భర్త నెత్తిన పప్పుచారు కుమ్మరించుట- బ్రహ్మ చూచుట "<<>>

పూలారి ఇల్లు శిథిలావస్థకు చేరి . పిల్లలు పడుకోవటానికి . ఆడవారి స్నానాలకు చాలా కష్టంగా వుంది . భర్త ఇంటిని బాగు చేయించ లేకపోతున్నాడు. ఈవిషయమై భార్యకు భర్త మీద కొండెత్తు కోపముగా వున్నది .ఇప్పుడు భర్తను అన్నానికి కూచో పెట్టి - ఇప్పుడెక్కడికి పోతాడో చూదాము అని ఆలోచించి - "ఏమండీ మరి ఇల్లు

ఎప్పుడు కట్టిస్తారు ? అని భర్తతో వాదనకు దిగింది . కోపాల కొండలు ఎక్కింది . పూలారి " ఇక వడ్డించ వే ?" అని అడిగినదే ఆలస్యముగా ఆమె ఒక చిన్నగిన్నెలోకి పప్పుచారు వంపుకొని తెచ్చి దాన్ని భర్త తల మీద దిమ్మరించింది .. భర్త ఎంతో శాంతముతో " ఎందుకే ఇంతకోపము? నెలకు ఒక్క ఏడు రూపాయలు ఆదాయము వచ్చే మార్గము కనపడనివ్వు . నీకోసం ఏడు అంతస్తుల మేడ కొనేస్తాను " అని బదులు ఇచ్చి - పెట్టినది తిని లేచాడు .

ఇది చూస్తున్న బ్రహ్మ " వీనికి నేను ఎంత సహనం రాసిపెట్టానో కదా ? ' అని ఆశర్య పోయాడు .

అప్పుడు అయన మూడు తలలోని ఒక తల " గుణములు అనునవి మనము నుదుట రాయము . మానవులు సాధన ద్వారాతమకు తాముగా గుణములను అలవర్చుకొనవలెనని మన ఆజ్ఞ " అని బదులిచ్చెను . బ్రహ్మకు మూడు తలలు వున్నందుకు ఇదీ సౌలభ్యం .

" సరే ఇంత సహన గుణము అలవర్చుకున్న ఈ పూలారికి నేను ఏదన్న మేలు చేసేది అనుకున్నాడు .

బ్రహ్మ 'అతని భార్య నుదిటి వంక చూసి - " ఈమె గొప్ప సాధ్వీ మణి కావాల్సింది "అని రాసి పెట్టాను కదా ? ఈమె ఎందుకు ఇట్లా ప్రవర్తించుచున్నది ? అని ఆశ్చర్యంపొందాడు .

దీనికి - అయన యొక్క మరొక శిరస్సు ఇట్లా బదులు ఇచ్చింది .

" సంతృప్తి వున్న స్త్రీలే సాధ్వీమణులు అవుతారు . వున్న దానిపట్ల సంతృప్తి చెందే స్త్రీలే కనుక ఉంటే - - వారి భర్తలు ఒళ్ళు వంచి పని ఎందుకు చేసెదరు ? మరింత కష్టపడి మరింత సంపాదించవలెనన్న స్ఫూర్తి , కోరిక, పురుషులలో కలుగుటకు గానూ వారికి కావాల్సిన ప్రేరణ శక్తి స్త్రీల అసంతృప్తి నుండి ఏ లభించవలెనని -- అలోచించి , మనమే, స్త్రీలకూ సంతృప్తి అన్నదే లేకుండునట్లు - వారి తల రాత లు రాయుచుంటిమి " అని బదులు చెప్పినది

<> <> బ్రహ్మ తన రాతను నిజము చేసుకొను పూనుకొనుట <><>

పూలారి భార్యను {ఆమె తలరాత ప్రకారము }సాధ్విని చేయుట అనగా ఆమె భర్తకు సంపదలు ఇవ్వ బ్రహ్మ నిర్ణయించుకొనెను [] అందుకుగాను బ్రహ్మ తన సంకల్ప ప్రభావముచే ఆ దేశపు ఏడవతరపు రాజుని పూలారి ఇంటి గుమ్మము ముందు నిలబెట్టెను .

" నెలకు ఒక్క ఏడు రూపాయలు ఆదాయము వచ్చే మార్గము కనపడనివ్వు . నీకోసం ఏడు అంతస్తుల మేడ కొనేస్తాను "అన్న" పులారి అంటున్న క్షణాన రాజు

పులారి ఇంటిముందు నిలబడ్డాడు . ఈరాజుకు "వింత సంగతులు" తెలుసుకోవలెనన్న ఆసక్తిచాలా మెండు . ఈ మాటలు ఆయన చెవులలో గింగుర్లెత్తినవి .

ఆరాత్రి తరువాత రాజు పులారిని తన కొలువుకు పిలిపించుకొని " నీకు ఏడు రూపాయలతో ఉద్యోగం వేస్తున్నాము . నువ్వు ఏపని చేయతలుచుకున్నావో నీవే నిర్ణయించుకొని - దాన్ని గురించి మంత్రుల దెగ్గరనుండీ ఒక ఫర్మాన తీసుకో " అని ఆజ్ఞ్యాపించాడు .

ఈ రోజులలో ఈ రాజుకొలువులో లో అతి చిన్న జీతము యాబది రూపాయలు ." వీడు ఏడు రోపాయల్తో ఏడూ అంతస్తుల మేడ యెట్లు కట్టునో చూతము " అన్న ఆలోచనతోనే రాజు అతనికి ఏడు రూపాయల వుద్యోగం వేసెను .

<><>"సముద్ర గణితము><><>

ఉద్యోగములు ఇచ్చు మంత్రి నీకేమి వచ్చును ? అని అడిగెను . మనవాడికి ఏ శాస్త్రమూ రాదు . అతనికి తెలిసినది యొక్కటే . బ్రహ్మగుడి యొక్క మండపములో కూచుని - అక్కడనుండి కనపడు సముద్రము వంక చూచుచూ కాలము వెళ్ల బుచ్చేది .[] ఒకనాడు ఎవరో వచ్చి ' సముద్రము, గణితము ఒక్కటే " అని అన్నారు . ఇప్పుడు ఆ మాటలు గుర్తుకు వచ్చి న మనవాడు " సముద్రగణితము " అని ఢంకా భజాయించి చెప్పెను .అప్పుడు మంత్రి " నీవు ఆ శాస్త్రమునందు మరింత కృషి చేసి రాజ్యమునకు ఉపయోగపడవాల్సింది . అని చెప్పి " ఇతడు రాజానుగ్రహము పొందిన ఉద్యోగి . ప్రజలెల్లరు ఇతని మాటను మన్నింపవలెను . ఇతని విధులకు - విధానాలకు ఎటువంటి ఆటంకము కలిగింపరాదు - ఆజ్ఞ మీరిన వారు శిక్షార్హులు " అని రాసి ఒక ఫర్మాన ఇచ్చెను . అంతే కాక" ఇది ఒక ఉద్యోగము కాబట్టి "నీవు కోమటి కొట్టుకు వెళ్లి ఫర్మానా చూపించి - ఒక చిట్టా పుస్తకము , ఒక కలము , ఒక సిరా బుడ్డి ఉచితముగా పుచ్చుకొనిపొమ్ము అని చెప్పెను .ఈ కోమటి కొట్టు ద్వారా " సముద్రము మీద ఒక ఉద్యోగి నియమింపబడినాడు అన్న వార్త " వూరిలో తెలిసినది .

మనవాడు ఎప్పటివలె బ్రహ్మ గుడిలో కమలములు సమర్పించి సముద్రము వంక చూచుచూ కూర్చుండును . ఇది వరకూ వాలే కాక ఇప్పుడు అతడు ఉద్యోగి . అందు వలన సముద్రము వంక చూచుచూ - సముద్రము వంక వచ్చి పోవుచున్న మనుషులను - సముద్రములో నుండి వచ్చి పోవుచున్న నౌకలను - నావికులను గురించి ఎదో ఒక అర్ధం పర్ధం లేని లెక్క రాయదొడగెను . మనవాడికి అంకెలు అన్నవి రావు . అనువల్ల కొన్ని నిలువు గీతలు కొన్ని అడ్డగీతలు , కొన్ని సున్నాలు కొన్ని స్వస్తికాలు , కొన్ని పద్మాలు కొన్ని నక్షత్రాలు వంటి గుర్తులు వుపయోగించి చేతికి తోచినది రాసేను . నెల చివరన జీతము ఇచ్చు మంత్రి , చిట్టా చూసి " ఎదో గొప్ప శాస్త్రము తయారు అగుచున్నది " అని భావించి - మనవాడిని ప్రోత్సహించెను . దీని తరువాత ముందుగా రాజవుద్యోగులు - ఆ తరువాత

సాధారణ ప్రజలూ " సముద్రము మీద నియమింపబడిన రాజవుద్యోగి - సముద్రము మీద జరుగుచున్న ప్రతివిషయమును - రహశ్య భాషలో ఏదో నమోదుచేసి - రాజుకు నివేదిక ఇవ్వనున్నాడని చెప్పుకొనిరి.

ఏది ఏమయినా మన వాడికి భార్య పోరు వదిలిన్ది కాదు . నేడు కూడా భార్యల పోరు పడలేని వారు - ఉద్యోగ ము చేయు చోటనే ఎట్లు తల దాచుకుందురో , అదే రకముగా మనవాడు కూడా రాత్రియంబగళ్లు - గుడి మండపము మీదనే గడుపుచూ ఉద్యోగము చేయు చుండును .సముద్రము మీద వర్తకము చేయు వారు ఇదంతా గమనించుతూ ఉండిరి . వారికి చెందిన కొన్ని రహస్య ఓడలు అర్ధరాత్రి వేళా రహస్యమైన సరుకులతో తీరమునకు వచ్చి పోవుట కలదు . వీటి మీద రాజుకు చెల్లించవలసిన పన్నులు ఎగ వేయబడుచూ వున్నవి . ఈ ఎగవేత వాళ్ళ వారు విపరీతమైన లాభములు తీయుచూ ఉండిరి .

వారు వచ్చి , మనవాడిని కలిసి " కేవలం ఏడూ రూపాయల జీతము కోసము నీవు రేయింబగళ్లు ఏల ఉద్యోగము చేయుచుండివి? " అని అడిగిరి .

"నాకు మొదటి నెల జీతముగా ఏడూ రూపాయలు చేతిలో పడగానే - ఏడంతస్తుల మేడ కొని ఇచ్చెదనని నా భార్యకు చెప్పితిని . జీతము వచ్చినా గానీ ఇల్లు కొనలేదని నాభార్య నన్ను శత పోరుచున్నది . ఇంటిలోని పోరు పడలేక నేను ఇక్కడనే పడి ఉంటున్నాను " అని నిజము చెప్పెను [] వర్తకు లందరూ కూడపలుక్కొని - డెబ్బది వేలు వెచ్చించి - ఒక ఏడు అంతస్థుల మేడని కొని , తెలివిగా అలోచించి - మనవాడి భార్యకు ఇట్లు కబురంపిరి " ఏడు రూపాయలకు మా భవనము మీకు అమ్మతలచితిమి" అని [] ఆమె వచ్చి అంతా చూసి - వాస్తు బాగానే వున్నదని అనుకోని - బట్టలు ఉతికి ఆర వేయుటకు మంచి వసతి కలదని తృప్తి పడి - తులసెమ్మను పెట్టుకొను చోటుకలదు అని మురిసి - ఇంటిని కొనుటకు అంగీకరించింది [] పట్టణ ప్రజలందరూ చూచు చుండగా - పులారి నుండి ఏడు రూపాయలు తీసుకొన్న వర్తకులు - ఆ ఏడంతస్తుల మేడను అతనికి అమ్మినట్లు ప్రకటించిరి . ఆ నాటినుండీ అది " ఏడు రూపాయల ఏడంతస్తుల మేడ" అయినది

<><> మన వాడు రాజు దెగ్గర చిన్న మంత్రి అగుట <><>

ఏడు రూపాయల ఏడంతస్తుల మేడగురించి రాజుకు తెలిసినది . ఆయనకు ఆసక్తి కరమైన కబుర్లు అందించు వారు - ఈ కబురు అందించిరి .

" వారు ఏడు రూపాయలకు వీడి కి ఒక ఏడంతస్తుల మేడ అమ్మినారన్న - రాజ్యము తరఫున - వీడు వారిని అంతగా ఎట్లు దడిపించెనో ? వారు చేయు రహస్య కార్యములను వీడేమి కనుగొనేనో - ఏమి చూశానో ? అని అలోచించి పులారి ని తన ముందుకు పిలిపించుకొని - విషయము వివరించమని అడిగే.

మనవాడు చిట్టా విప్పి విచిత్రమైన గుర్తులు చూపుచూ , తనకు వచ్చిన కలలు, గుర్తుకు వచ్చిన విచిత్రమైన ఓడరేవు యొక్క సంగతులు మిళాయించి చెప్పెను . అంతా కాక కొంత విన్న పిదప " రాజు గారు " చీకటి మాటున జరుగుచున్న వర్తకము , దానికి పాల్పడిన వర్తకులు, మొదలగు వాటి గురించి వివరములు మనవాడు తేదీ

మరియు నిమిషముల వారీగా ఎన్నో రహస్య వివరములు నమోదు చేసి వున్నాడు . దీని సాక్ష్యముగా నేను చర్యలు చేపట్ట వచ్చు "అనిభావించి - ఓడరేవు ఉద్యోగులందరినీ ఉద్యోగము నుండి తొలగించి కొత్త వారిని పెట్టెను .

ఆ నియామకపు పని పూలారి ఏ చూచెను. ఈ తరువాత ఓడరేవునుండి రోజూవారీగా రాజుకు వచ్చు ఆదాయము ఒక లక్ష రూపాయలు అదనము అయినది అని కోశాధి కారి రాజుకు చెప్పెను [] దీనితో మనవాడు రాజుకు ఒక చిన్న మంత్రి అయ్యెను []

ఇక్కడితో ఈ కదా అయిపొయిందిఅంటే అయిపోయి నట్లే - కానీ ఇంతవరకూ జరిగినదంతా మన వాడి భార్యను మెత్తపరిచి ఆమెను సాధ్విగా మార్చుటకు బ్రహ్మచేసిన ప్రయత్నమే అనవచ్చును .

<>నూట ఒక్క రాళ్ల కథ <>

మనవాడు చిన్నగా మంత్రికాగానే - రాజును ప్రోత్సహించి - పాడుపడి రాళ్లు ఊడి కిందపడుచు శిధిలా వస్తకు చేరుచున్న బ్రహ్మగుడిని పునర్నిర్మింప చేయు నట్లు చేసెను .

ఒకనాడు కట్టు బడి దారులు వచ్చి " ఆలయ పునర్ నిర్మాణము సంపూర్ణమైనది . ఎందువల్లనో కానీ నూట ఒక్క శిలలు మిగిలినవి . వాటి మీద వింత గుర్తులు వింత బొమ్మలు వున్నవి . వాటిని ఆలయములో ఎక్కడ ఇమిడ్చినా గాని - తిరిగి పెల్లగించుకొని వచ్చి బయటకు పడుచున్నవి" అని చెప్పిరి

రాజుకు ఆసక్తి మెందుకదా ? అయన బహు శాస్త్రములు చదివిన వారిని పిలిపించి - వివరము ఏమిటి అని అడిగెను

వారిలోని నాలాంటి వాడు ఒకడు ఇట్లనెను " మీ పూర్వీకులకు పూర్వీకులైన మొదటి తరము రాజుగారు - ఈ ఆలయమును నిర్మించి - బ్రహ్మ విద్యా మూలకంగా ఒక రాక్షషిని స్వాధీన పరుచుకొని ఆ కొలనులోకి ప్రవేశపెట్టి, రాజ్యము మీదకు ఎవరన్నా దండయెత్తి వచ్చినప్పుడు వారికి తగిన గుణ పాఠము నేర్పుటకు ఈ రాక్షసిని ఉపయోగించుకొనుటకు నిశ్చయము చేసి పెట్టెను . ఈ రాక్షసి ఎంతో సహన స్వభావము వున్నా వారి మాట కానీ వినదు . గొప్ప సహన స్వభావము లేని వారు లేని పోనీ కోపము తెచ్చుకుని తన ద్వారా లోకమును పీడింతురేమో ననీ దాని ఆలోచన " మంచి సహన స్వభావము కలవారు ఎవ్వరో కనుగొనవలనని - మన మొదటి తరపు రాజుగాబు ఒక పులారిని ఏర్పాటు చేసిరి . ఎవ్వరూ రాని ,ఏ ఆదరణ లేని , ఏదన్న కానుకలు వచ్చును అన్న ఆశలేని గుడికి పులారిగా ఉండుటకు , ఒంటరిగా కాలము గడుపుటకు ఎవరికైనను ఎంతో సహనము కావలేకదా ?

ఆ నాటి నుండి నేటి పులారి వరకు అందరూ ఎంతో సహన గుణము ప్రదర్శించిరి . అందువల్లే ఇతను తనకు వచ్చు అర్ధ రూపాయ జీతము అందకున్నను , భూమి కుంచించుకు పోయినా నోరు మెదపలేక పొయను. ఇప్పుడు మనకు దొరికిన నూట ఒక్క శిలలను ఎవరైనా ఒక సహనగుణ సంపన్నుని చే కొలనులోకి వేయించినచో - నీటిలో వున్నా ఆ రాక్షసి కి ఈ రాళ్లు మామిడి పండ్ల వాలే రుచించును [] ఆ రాళ్ళని

తిని - సంతృప్తి చెంది - బయటికి వచ్చి న రాక్షసి తనకు ఆహారము ఇచ్చిన వారి మాటను మన్నించి వారు చెప్పిన పని చేయును "అని చెప్పెనెను .

ఇప్పుడు చూసిన - బ్రహ్మ కు ఆలయము ఎందుకు కట్ట బడినది అందులో ఒక పులారి ఎందుకు నియమింపబడినాడు ? అన్నది మనకు తెలియును .

<> " దైవనిర్ణయకము " అను రాక్షషుడు వచ్చుడు <>

ఇదే సమయమున నలుగురు శత్రు రాజులు కూడపలుక్కొని - మనవాడి రాజుయొక్క రాజ్యము మీదకు దండెత్తి వచ్చిరి . పండితులు మంత్రములు చదువగా మనవాడునోటొక్క శిలలనూ కొలనులో వేసెను . అప్పుడు " దైవనిర్ణయకము " అను రాక్షసుడు బయటికి వచ్చను . అతడు లంఖిణికి అన్న అనునట్లు ఉండెను .ఇతను ఎవరినీ చంపి తినడు . పండ్లు మాత్రమే తిను వాడు - మానవులను నోటిలోకి పీల్చుకొని వారిని నడి సముద్రములోనికి ఉమ్మను . ఇట్లు చేయుటవలన - బ్రహ్మనిర్ణయము ప్రకారము ఆయువు మూడిన వారు మాత్రమే నడిసముద్రములో మునిగి మరణించుదురు . మిగిలిన వారు చావు బ్రతుకులమధ్య తీరము చేరి - భయ భక్తులతో బుద్ధిగా బ్రతుకుదురు .ఇదీ ఆ రాక్షసుని మనస్సు .

మన పులారి "దైవనిర్ణయకము" నకు శత్రు సైన్యము నంతటిని చూపి వారిని మింగుము అని చెప్పెను. రాక్షషుడువారిని అందరిని పీల్చి మింగి సముద్రములో నికి ఉమిసెను . మరణము రాసివున్నవారు మరణించిరి. మిగతా వారు చావు బ్రతుకుల మధ్య అలలపై తేలుచు వేరు వేరు దూర తీరములకు చేరిరి . యుద్ధము అన్నది లేకనే అంతయూ శాంతి అయ్యెను .

ఈ ఘటన తరువాత మనవాడి రాజుకు ఎదురు లేకపోయినది . ఎక్కడెక్కడి రాజులు ఇది విని భయపడిపోయి - ఈ రాజునకు కప్పములు కట్టి లొంగిపోయిరి . రాజుగొప్ప చెక్ర - వర్తి అయ్యెను

మనవాడు ముఖ్యాతి ముఖ్య మంత్రి అయ్యెను .

ఆనాడు ఆ భార్య పప్పుచారుతోతన భర్తను అభిషేకించుటచేతనే ఇదంతా జరప వలిసి వచ్చినది కదా? అనితలుచుకొని బ్రహ్మ - సరస్వతులూ పడీ పడీ నవ్వుకొనిరి .

కధ సంతృప్తి క్రమంగా లేదా ? అయినచో మరింత ఇమ్మని బ్రహ్మకు మొక్కుడు .శాంతము సముద్రముకన్న పెద్దది అని ఒక లారీ వెనుక రాసివుండగా నా చిన్నప్పుడు చదివితిని . నేడు చెప్పితిని .

**a original by varanasi sree ramakrishna**

-----------------------------------------------------------------------------------------

పెళ్ళాము చెప్పింది వినాలి

ఒకాయనకు బాగా పేకాట పిచ్చివున్నది .ఇంటికి వచ్చి జేబుచూసుకునేసరికి ఒక్క యాభై రూపాయలు మాత్రం వున్నవి . పెళ్ళాం పెట్టింది తిని - ఇకచేసేది ఏమీ కనపడక , పడక వేసాడు. నిద్రలో ఒక దేవతా మూర్తి కనపడింది . ఆమె ఎవరో కాదు ఆయన భార్యనే .దేవకన్య రూపంలో కనపడుతోంది . కనపడి " ఏమండి వూరికి ఉత్తరాన వున్నా చింతల తోపులో పేకాట జరుగుతున్నది - వెళ్లి రండి"అని సలహాచెప్పి ప్రోత్సహించింది . అంతే కాక అతనికి చిరునవ్వుతో ఎదురొచ్చింది . పేకాట పేకోసమని ఎన్నో ప్రదేశాలు తిరిగిన వాడు మన వాడిపేరు ఘటికాచలము .ఈ కల అతనిలో గొప్ప సెంటిమెంటు ని నిద్రలేపింది . భార్య నే కలలోకి వచ్చి పేకాట ఆడమని సలహా చెప్పటము - పోవాల్సిన ఆ చోటు పేరు చెప్పటం - నవ్వుతూ ఎదురు రావటం .. ఇదంతా కలలోనే అయినా దేనికి సంకేతము? ... కలలోకి వచ్చింది తన భార్య రూపం వేసుకున్న అదృష్ట దేవత కాదా ? అని ఆలోచించాడు .

ఘటికా చలము చింతల తోపులో ఆటకు కూచుని , యాభై రూపాయలతో మొదలుపెట్టి - ఆట మీద ఆట గెలుస్తూ - ఒక సమయానికి ఐదు లక్షలు జేబులో ఉంచుకున్నాడు . తిరిగి ఆ ఐదు లక్షలను పేకాటలో పందెం పెట్టాడు . మిగతా ఆటగాళ్లు ఘటికా చలం చేయి రైజింగ్ లో ఉందని బెదిరి పోయి " ఇక్కడ సంపాదించింది ఇక్కడే పందెంకాస్తే ఒప్పుకునేది లేదు .ఈ డబ్బునుఇంటికి తీసుకెళ్లి ఒక నిద్ర చేయించి , మళ్ళా రేపు ఇదే సమయానికి ఇక్కడికి తీసుకువచ్చి - ఆటలో కూచో. అది మన కట్టుబాటు " అని చెప్పి అతన్ని బలవంతంగా వెళ్ల గొట్టారు [] వాళ్ల భయం వాళ్ళది .

కానీ మన ఘటికాచలం వింటేగా? - తాటి తోపుల్లోకి పోయి అక్కడి పేకాటలో కూచున్నాడు. అక్కడ - తన దెగ్గరవున్న ఐదు లక్షలు ఐదు నిమిషాల్లో పోగొట్టుకొని ఇంటికొచ్చాడు . తలుపు తీసుకొని ఇంట్లోకి అడుగు పెడుతుంటే " ఎక్కడికి వెళ్లారండి అని భార్య అడిగింది .

" అల్లా వెళ్లి సిగిరెట్ పాకెట్ తెచ్చుకున్నాను . -అది సరే. ఏది ఏమైనా గానీ పెళ్ళాము చెప్పినట్లు వినటమే అన్నింటికీ మంచిది అని తెలుసుకున్నాను " అని కుర్చీలో కూచున్నాడు .

" నువ్వు పెళ్ళాము మాట కానీ ,ఆమె బంధువుల {*)మాటా, కానీ వినేరకం కాదు . నీకు చెప్పిన వాళ్లదే బుద్ధి తక్కువ " అని చెపుతూ , ఇందాక ఘటికాచలం కలలో చూసిన స్త్రీ రూపం అతని భార్యలో నుండి లేచి వెళ్లి పోయింది . అతని భార్య అధాట్టుగా నిద్రలేచి "ఏమిటండి అర్ధరాత్రి ఆ సిగిరెట్లు . నామాట వినండి" అని ఆ నిద్రమత్తుతోనే భర్తను బ్రతిమాలి - మళ్ళా ముడుచుకొని పడుకుంది

ఆమె బంధువులు {*)= ఇక నువ్వు ఇంటికి వేళ్ళు అని ఘటికాచలాన్ని పంపేసినవారు .

"ప్లాన్ 75 " అనే ఆలోచన 19-08-22

ప్లాన్ 75 అను పేరు మీద అంతర్జాతీయంగా మన్ననలు పొందిన ఒక జపనీస్ సినిమా వచ్చింది . 70 సంవత్సరాలు దాటినా వారిగురించి - వారి బంధువులు ఏమనుకుంటున్నారు ? వారిగురించి వారు ఏమనుకుంటున్నారు ? వారి గురించి ప్రభుత్వాలు ఏమనుకుంటున్నాయి ? అన్న దానికి సమాధానాలు వెతుకుతూ ప్లాన్ 75 అను సినిమా తయారు అయ్యింది .

16 -08 -22 లేదా 17 -08 -22 తారీకులలో ఆకాశవాణి కేంద్రం నుండి ఒక పాత తరానికి ప్రతినిధి లాటి ఒక మహిళా మాట్లాడారు - ఆమె చిన్నప్పటి నేటికీ వచ్చిన మార్పులు - దానివల్ల నేటి జీవితం సూన్యంగా ఉండటం- జీవితంలో సంతోషం లేకపోవటం గురించి మాట్లాడారు . కొంత వయస్సు దాటినా మనుషులు దేనికీ పనికి రానివారని సమాజం భావన చేయటం గురించి ఆమె కొంత ఆవేదన చెందారు .

పై రెండు సంగతులను పునర్స్కరించుకొని ఒక వ్యాసము:-

01 ) ప్రపంచం లోని అన్ని ప్రభుత్వాలు 60 నిండిన వారిని సీనియర్ సిటిజెన్ గా ప్రకటించి - వారికి కొన్ని సౌకర్యాలు ఆర్థిక పరమైన రాయితీల రూపంలో ఇస్తున్నవి . ఇందులో నిజంగా ఏమి వుంది ? ఏముంది అంటే జస్ట్ 60 దాటినా వారిని అల్లా రిటైర్ చేసి పక్కన పెట్టకుండా - వారికి కొన్ని ఆరోగ్య సౌకర్యాలు కల్పించటం ద్వారా వారి శక్తి యుక్తులను, మరి కొంత కాలం పాటు దేశం కోసం పొందవచ్చును గదా అన్న ఆలోచన వున్నది .

నిజానికి సీనియర్ సిటిజన్ కి ఇస్తున్న ప్రయోజనాల వల్ల దేశాలు ఏమి లభ్ధి పొందుతున్నాయి ?అని కొందరు రాజకీయనాయకులు ప్రశ్న లేవదీసి , మన ఆర్థిక వనరులు సమర్థవంతంగా వాడుకోవాలి అంటే వారికి ఇచ్చే సౌకర్యాలను తగ్గించ వలెనని ఆలోచన కనిపెట్టారు

. మరి 60 దాటినా వారి సంగతి ఇలావుంటే మరి 70 ధాటిన వారి వల్ల ఇంకా ఏమి ప్రయోజనము అన్న ఆలోచన రావటము సహజము .70 దాటినా వారు 60 దాటినా వాళ్లకు ఇస్తున్న రాయతీలు సౌకర్యాలు వంటివీ తాము అనుభవిస్తూ - 60 దాటిన వారు దేశానికీ ఉపయోగ పడ్డట్లు గా , ఏమీ ఉపయోగ పడటం లేదు .పూర్తి నిరుపయోగంగా వున్నారు? . వీరిని ఏమి చేయాలి అన్న ఆలోచనే "ప్లాన్ 75 "సినిమాకి పునాది .
02 ) ఒకప్పుడు నూరు సంవత్సరాలు బ్రతకటం అన్నది ఒక అదృష్టం .ఇప్పుడు అది ఒక శాపము . నిండు నూరేళ్లు బ్రతికితే మనుమలని , మునిమనుమలను ఎత్తుకోవచ్చు . వారికి కబుర్లు చెప్పవచ్చు . వాళ్ల నాన్న చేసిన దుడుకు పనులు చెప్పి తమ యవ్వనప్పు జ్ఞపకాలను నెమరు వేసుకోవచ్చు . వయస్సు వస్తున్నకొద్దీ భాద్యతలు లేని సంతోషము అనుభవించవచ్చు . కానీ నేడు దీనికి అవకాశము లేదు . పిల్లలను పెద్దలతో కలవనీకుండా వారి తల్లితండ్రులే ఒక తెర కడుతున్నారు . . పిల్లలు నూతన పోకడలు నేర్చుకోకుండా , పాత తరం అలవాట్లు నేర్చుకుంటారేమో అన్న అనవసర భయంతో తల్లితండ్రులే వారిని వేరేదిక్కుకు ప్రోత్సహించటం -వారికి లక్ష రూపాయల ఫోన్లు కొని ఇవ్వటం-మామూలు అయ్యింది . దీనివల్ల 60 దాటినా వారికి కాకా పోయి నా 70 దాటినా వారిలో సూన్యం

ప్రవేశిస్తున్నది . మరి ఈ సూన్య మనస్కులు ఏమి ఆలోచిస్తున్నారు ? ఏమి ఆశిస్తున్నారు? అన్న అన్న ఆలోచనే ప్లాన్ 75 అనేదానికి పునాది .

03 } "డెబ్బది దాటినా వారిని ఏమిచేయమన్నారు ?" అంటే? నెలరోజులకు పైగా ఫ్రిజ్జులో పెట్టిన టమోటాలను - దుంపలనీ ఏమి చేస్తామో - అట్లాగే చేయండి" అని ఇంకా పెద్దలుగా మారని పెద్దలు అన్నారు

04 ) మిమ్మల్ని ఏమి చేయమన్నారు ? అని 70 దాటిన వాళ్లనే అడిగితే వాళ్ళు ఇట్లా అన్నారు " తొందరగా సహజ మరణము పొందేటట్లు చూడండి .70 వచ్చినప్పుడు - నిదానంగాను, మా గౌరవానికి లోపం లేకుండానూ చనిపోయేటట్లుగా శరీరంలోకి ఏదన్న ఎక్కించండి " అని అడిగారు . ఈ కోరిక కు కారణము జీవితములోనికి ప్రవేశించిన సూన్యమే .
05 ) పండుటాకులు చెట్టుకు పోషణా కాదు అందము కాదు .భారము " అని కొందరన్నారు
06 ) నాకింకా మెత్తని దిండు కావలి అని కొందరడిగారు
07 ) సినిమాల్లో హీరో హీరో ఇన్లు పడుకునే బెంచీలవంటి వి పార్కుల్లో కూడా ఉంచాలి - అని కొందరు అడిగారు . వీళ్ళు అపార్టుమెంట్లు వదిలి కేవలం మనుషులను చూడటం కోసం అని పార్కులలో కూచుని వుండే వృద్ధులు .

ఇంతకీ ఈ సినిమా కథా స్వరూపం ఏమిటంటే ?ఒక దేశము యొక్క ఆర్థిక ప్రయోజనాల దృష్ట్యా , 70 యేండ్లు దాటినవాళ్ళని, దేశంకోసం ఏదన్నా త్యాగం చేయమంటూ ప్రోత్సహించాలని , -- --ఈత్యాగం దేశం కోసం సైనికులు చేసే త్యాగం కన్నా మిన్న అయినదని - ఒక ఎమోషనల్ అభిప్రాయాన్ని ప్రజలలో ప్రచారం చేయాలని - ఒక రాజకీయ నాయకుడు ప్లాన్ రూపొందిస్తాడు . 70 లేదా అంతకు మించి వయసు . వారికి ఒక్కసారి కొంత పెద్ద మొత్తము ఇస్తారు . దీనికోసము అని వీరు ఒక సిస్టమేటిక్ పద్ధతి ప్రకారము జీవితము ముగించుకోవటానికి ఇష్టపడాలి . ఈ 70 దాటినా వాళ్ళు తమకు బంధువులు కారు అని నిరూపించిన వారి ద్వారా మాత్రమే ఆన్ లైన్ అప్లికేషన్ పెట్టాలి . ఎందుకంటే కుటుంబము , భందుత్వాల సెంటిమెంటును మొదటనే తుంపి వేయాలి గదా అని ఈ రూలు పెట్టారు .
దీనికి నా ఉదాహరణ - వీళ్ళు ఇప్పటినుండే బెర్తులు ఖాళీ చేసి దిగి వెళ్లిపోవటానికి సిద్ధ పడితే - ఢది సంవత్సరాలు దాటక- అనే స్టేషన్ వచ్చే సరికి కొత్తవారికి బెర్తులు అందుబాటులో ఉంటవి . తమ బెర్తును వదిలేసుకొని ఇంకొకరికి బెర్తు చూపటమే వీరు దేశము కోసము చేయవలసిన త్యాగము .

వీరు తొందరగా బెర్తు ఖాళీ చేయటం వల్ల ప్రభుత్వాల మీద , డాక్టర్ల మీదా, హాస్పిటల్స్ మీద , రీసెర్చ్ రంగాల మీద అనవసర ఒత్తిడి తగ్గుతుంది .అనవసరమైన డబ్బుఖర్చుగూడా జరుగదు .

సినిమా నేపథ్యం ప్రకారం - తమ కళ్ళఎదుటే నే సంతానాన్ని కోల్పోయి న వారు , సంతానంనుండి ఆదరణ కోల్పోయినవారు , సొంతగా పనులు చేసుకొని వారు - సునాయాస మరణం కోరుకునే వారు ఈ పథకం వైపు మొగ్గు చూపుతారు .

ఇదంతా ఒక సినిమా- మనకేమీ భయం లేదు . ఇది ఇండియా సినిమా కూడా కాదు - అందువల్ల అస్సలు భయం లేదు .ఆలోచనలో పడక్కరలేదు . .

---------------------------------------------------------------------------------------------------------------

<<సాంప్రదాయాలు సంగతులు>> - తాళి బొట్టు 11-8-22

దక్షిణ భారత దేశములోను - ఉత్తర భారత దేశములోను అనేక విషయాలలో ఆచార బేధాలు ఉండటం చూస్తూ ఉంటాము - దీన్ని గురించి ఏమిటంటే - దక్షిణ భారతంలో - ఋషులు- మునులు - వేదవేత్తలు సూచించిన పద్ధతులను - ప్రజలు ఆచరించారు-వాటినే తమ ఆచారంగా స్వీకరించారు [] ఉత్తర దేశప్రజలు నిత్య జీవితంలో ఆచరించే విధి విధానాలను - అలవాట్లను ఆ దేశ పండితులు ఆ ప్రాంత ఆచారాలుగా రూపొందించి మంత్రం పూర్వకంగా చేసే క్రియలలో అమలు జరిపారు - ఇది ముఖ్యంగా వివాహ తంతులో కనపడుతుంది [] అనుదువల్ల ఉత్తరాది వారికి వివాహ తంతు లో మంత్రం అవసరం లేని కొన్ని ఆచారాలు ఉంటాయి []

<<తాళి బొట్టు గురించి>>

బాగా పూర్వ కాలములోను నయినా మరియు నేటి కాలంలోకూడా - బాల బాలికలు మెడలో ధరించుటకు గానూ వారి తల్లి తండ్రులు ఏదైనా నగను చేయింతురు గదా ? ఇట్టి సందర్భమున తల్లి తండ్రులు తమ పిల్లలకు మొదటిగా ఇచ్చు ఇచ్చు లేదా ఆచార ప్రకారము ఇవ్వవలసిన మొదటి నగ ఏమి ఐ ఉండును అని ఆలోచించ వలయును [] మొగపిల్లలు అయినచో మొదటిగా ఇవ్వవలిసిన నగ - పులిగోరు పతకము [] ఆడపిల్లకు ఇవ్వవలసిన మొదటి నగ బొట్టు అనబడు బంగారు బిళ్ళ [] ఇదియే స్త్రీలు మొదటిగా మేడలో ధరించు బంగారు ఆభరణమును - [] బొట్టు అనగా గుండ్రని బిళ్ళ - ఈ బిళ్ళపై చిలుకల బొమ్మను ఛిత్రుంచుదురు - దీని అర్థము ఆ స్త్రీ సంతాన యోగ్యత కలదని చెప్పుట [] అటు ఆడా ఇటూ మోగా కానీ పిల్లలు పుట్టుట ఆనాడు కూడా కలదు - వారికి కూడా బొట్టు అను ఆభరణమును ఇవ్వ వలసినదే కదా ? కానీ దానిమీద చిలుక బొమ్మలు వుండవు [] పులిగోరు పతకము లేని బాలురు - బొట్టు అను ఆభరణము లేని బాలికలు ఉన్నయెడల వారు తల్లి తండ్రులను కోల్పోయిన ఆనాధలు -[] స్త్రీలు ధరించు ఈ బొట్టు అను మొదటి ఆభరణమే కాల క్రమేణా తాళి బొట్టు గా మారినది - అది ఎల్లా జరిగింది అన్నది తెలుసుకుందాము
బొట్టు అను మొట్ట మొదటి ఆభరణమును దారము తో కూర్చి మెడలో తాల్చుటకు వీలుగా తయారు అయివున్నది కావున , ఇది మొదటగా " తాల్చు" బొట్టు అను పేర పిలువబడి క్రమముగా తాళి బొట్టు అయినది [] ఇది కాక తాలిక అను యొక్క మాట వున్నది [] దీని అర్థము దారముకొసలను మెలిపెట్టి పురి ఎక్కించుట అని [] బొట్టు అనే గుండ్రని బంగారు బిళ్ళకు తాలిక వేసిన దారమును ఎక్కించుటచే కూడా బొట్టు క్రమముగా "తాలిక బొట్టు" అయి ఆ మాట కాస్తా తాళి బొట్టు అయినది [] ఇది కాక తాలి అను మరొక మాట కలదు - దీనికి అర్థము పేనిన దారము అని [] నేటి పెళ్లిళ్లలో కూడా పురోహితుడు దారమును పేని - దానికి బొట్టు అనే ఆభరణమును కూర్చి - ఇచ్చుచున్నాడు - ఇట్లా చూసినా కూడా తాలి కూర్చిన బొట్టు అనగా

దారమును పేని కూర్చిన బొట్టు ఆభరణము = తాళి బొట్టు అవుచున్నది [] బొట్టు అను ఆభరణము మొదటి ఆభరణముగా పుట్టింటి వారే ఇచ్చెదరు కదా ? వారు ఇచ్చు ఈ ఆభరణము కలకాలం మెడనందు ఉండవలెనని స్త్రీలు కోరుకునటలో వింత లేదు కదా ? కలకాలం లేదా ఎక్కువకాలం మెడలో నుండుటకై - -- నీటిలో నానినా లేదా చెమటకు తడిసినాకూడా చెక్కు చెదరని దారము కోసము వెతికిరి [] - తాళ వృక్షము అనగా తాడి చెట్టు యొక్క నార ఇందుకు తగిన దారము అనికనుగొనిరి [] . తాళపత్ర గ్రంధాలు అనగా తాటియాకుల పైన రాసిన పుస్తకాలు అనేక తరములు మన్నుట దీనికి ప్రమాణము [] ఈ రకముగా చూసినప్పుడు తాళవృక్షము యొక్క నార అనగా దారమునకు కూర్చిన బొట్టు అను తాళి బొట్టు అయినదని ఒక భావన [] తూర్పు ఆకాశమున తొలి బొట్టు సూర్యుడు - స్త్రీజీవితమున ఉషోదయమునకు తోలి బోట్టు, భర్త [] ఈపండిత భావములను అనుసరించి తొలి బొట్టు తాళి బొట్టు అయినది [] అస్తమయం తరువాత సూర్యుడు లేని లోకముఎట్లుండునో -భర్త అస్తమయము అనంతరము స్త్రీ జీవితము అట్లుండును అని సూచనగా తొలి బొట్టును అనగా తాళి బొట్టును తీసివేయుట ఆచారములోనికి వచ్చినది [] తాళి బొట్టు అను దానికి సరిపడు బంగారము లేని పేదల పరిస్థితి ఏమిటి అని ఆలోచించ వలయును [] బంగారపు బొట్టును మొదటి ఆభరణముగా తమ పిల్లలకు ఇవ్వలేని పేదవారు - ఒక రావి యాకు లేదా తాటి ఆకుకు దారము కట్టి పిల్లలకు మొదటి ఆభరణముగా ఇచ్చుట కలదు - దీనిని అనుసరించి తరువాత కాలములో పసుపు కొమ్ముకు దారము కట్టి అదే బంగారపు బొట్టుఆభరణమునకు -సమానము అని భావించారు [] పసుపుకొమ్ము ఛాయలో బంగారు రంగు తో ఉండుటకారణముగా బంగారపు బొట్టుకు పసుపుకొమ్ము ప్రత్యామ్నాయము అయినది [] నేడు వివాహములో వధువు మరియు వరుని చేతికి పచ్చని ఆకుతో కూడిన లేదా పసుపుకొమ్ముతో కూర్చిన కంకణము కట్టెదరు కదా ?ఆ కంకణము కూడా పూర్వము బంగారముతో నే కూర్చి కట్టుకొనెడివారు - ఈ బంగారమును మధ్యతరగతి వారుకూడా సమకూర్చుకోలేరు ఏమో? అన్న భావనతో బంగారము బదులు ఆకులు పెట్టారు - దీన్ని అర్థం చేసుకుంటే మెడలో బొట్టు లేదా తాళి బొట్టు బదులు పసుపుకొమ్ము కట్టుకొనుట అర్థం అవుతాయి [] చేతికి కట్టు రక్షా బంధన మెటువంటిదో బొట్టు కూడా ఒకరకమైన రక్షా బంధన వస్తువు [] గృహస్థులు మొగపిల్లల మెడకు వేయు పులిగోరు పాతకము కూడా ఒక రాఖీ వంటి రక్షా బంధన వస్తువు [] ఏ జాతి పురుషుడైనను గాంధర్వ పద్ధతిన ఎవరినైనా వివాహమాడినప్పుడు - తన మేడలో వున్న పులిగోరుఫతకమును కన్య మేడలో అలంకరించినచో - అది స్త్రీకి తాళి బొట్టుకు సమానమగును [] ఇందులో పురుషుడు తనకు పుట్టింటి వారినుండి లభించిన రక్షను స్త్రీకి ఇస్తున్నాడు అని విసెదము అవుతున్నది [] ఇక పిల్లల తల్లి దండ్రులే సంభందం కుదుర్చుకొని వివాహాలు జరిపించినచో - ఆ జంటను కూర్పు అందురు [] కూర్పు వలన జరిగిన వివాహానికి - స్త్రీ పురుష కుటుంబానికి చెందిన అన్ని బంధు వర్గాలవారు రక్షణ ఇవ్వవలిసిందని ఆచార వ్యవహారము [] బొట్టు అనునది పుట్టినింటి వారినుండి లభించిన రక్షా కవచము వంటిది అయినందున - స్త్రీలు దీనిని మరొకరికి ఇవ్వరు [] తన భర్త వేరొకరి కి తాళి బొట్టు కట్టినచో - అతను ఆ స్త్రీకి రక్షగా నిలబడి నాదని అర్థము [] ఇందువల్లనే - భర్త వేరొకరి కి తాళి కట్టినాడని తెలిసినప్పుడు - స్త్రీలుతమ నిజ భర్తను - కొట్టెదరు - తిట్టెదరు -తన్నెదరు - దుమ్ములో వేసి దొర్లింతుబు . [] నేడు చూసి నట్లు అయితే తాళికి సహజముగా రెండు బొట్లు ఉండును [] మొదటిది పుట్టింటి వారు ఇత్తురు [] రెండోది అత్తఇంటి

వారు ఇత్తురు - అనగా వారుకూడా పిల్ల తల్లి తండ్రులవలె పిల్లకు రక్షణ నిచ్చెదమని ప్రకటించారని అర్ధము [] కొందరికి మూడు బొట్లు తాళిలో ఉండుటకలదు[] ఈ మూడవ బొట్టు ఎవ్వరు ఇచ్చినప్పటికీ - ఆ పిపిల్ల తన యొక్క కులము, సమాజము ననుసరించి - కుల కట్టు బాట్లు అను నియమములు క్రింద మరింత అదనపు రక్షణ ఇచ్చినారని అర్ధము [] వీరు తమ భార్య భర్తల తగాదాలను కులకట్టుబాట్లకు లోబడి పరిష్కరించుకొనెదరని అర్ధము [] ఇక తలంబ్రాల విషయానికి వస్తే - వయస్సు పండిన దంపతులు ఆశీర్వాద పూర్వకముగా వధూ వరుల శిరస్సులపై పసుపు కలిపిన బియ్యమును దోసిళ్ళతో పోయవలెనని మొదటి ఆచారము [] వీరికి ఓపిక తగ్గినందువల్లను - పురోహితులలో పెరిగిన ఉత్సాహం వల్లనూ - వధూ వేరులే ఒకరి నెత్తిన ఒకరు తలంబ్రాలు కుమ్మరించుకొని ఆనందించుట వచ్చినది [] తలంబ్రాల తంతు లోని పెద్దలను తప్పించుటను " ఇకనుండి మీ పెద్దలకు - ఏమీ ఖాతారీ లేదని తెలుపుట యే అనుకోవచ్చును [] దీన్ని మరింత తరిచి చూస్తే - శ్రీనివాస కళ్యాణము - పార్వతీ కళ్యణము వంటి శిల్పాలు , చిత్తరువులూ చూసినపుడు - వారి వివాహసమయంలో బ్రహ్మ నిలబడి ఉన్నట్లు చూపించుతారు [] చిన్న దేవుడు అయినా బ్రహ్మ పెద్ద దేవుళ్ళు అయినా వారి మీద అక్షింతలు చల్లి వారిని ఆశీర్వదించటానికి అక్కడ నిలబడి వున్నాడు అన్నది అసంగతంగా ఉంటుంది [] అయన అక్కడ నిలబడింది ఎందుకనగా ? వధూ వరులమీద తలంబ్రాలు పోయుటకే అని గ్రహించాలి - ఎందుకంటే బ్రహ్మను మించిన ముసలి గృహస్తు వేరెవ్వరు లేరు కదా ? ముసలి దంపతులు -ఆది దంపతులకైనా తలంబ్రాలు పోయవచ్చు [] బ్రహ్మ ఆ అవకాశం సద్వని యోగించుకుంటున్నారు- అదీ ఆ బొమ్మలోని ఉద్దేశ్యము [] నిజానికి ఈ తలంబ్రాలను అనగా పసుపు కలిపినా బియ్యాన్ని వృద్ధ దంపతులు తమ ఇండ్లలోనే చేసుకొని తీసుకు వచ్చి వధూ వరుల శిరస్సుపై ఉంచాలి []
తాళి బొట్టును ఒక చోట అనగా కొబ్బరి బొండము లేదా కలశము మీద ఉంచి దాని సమంత్రకంగా వధువు మెడలో ధారణ చేయించుటకు సిద్ధము చేసినపుడు అది మంగళ సూత్రము అయ్యింది [] మంగళ సూత్రము అని అన్న ను తాళి బొట్టు తాడు అనుటకే జన సామాన్యము ఇష్టపడ్డట్లు వున్నది [] " తాడు తెగా " " తాడు తెగింది " అనునవి దీనికి ఉదాహరణలు [] కోపము వచ్చిన అమ్మాయి భర్తకు దూరంగా ఉంటే - మాంగళ్య ధర్మమును పాటించనట్లు [] కోపము వచ్చిన అమ్మాయిఎటువంటి సమాచారం ఇవ్వకుండా ఎక్కడికో వెళ్లి పోతే " తాళి తెంపుకుని వెళ్లి పోయిందని జనులు అంటారు[]

నేను కూడా ఒక్కటి అంటే కానీ నాకు నిద్ర పట్టదు[] అందుకని నేనూ ఒక సమిధను వేస్తాను - కొందరు స్త్రీలు తమ మెడలోని పసుపు దారానికి తాళం చెవులు కట్టుకుంటారు - ఇది గ్రామీణ జానపద స్త్రీలలో నేటికీ చూడవచ్చు [] తాళము మరియు తాళపు చెవి అనేది ఎప్పుడో శ్రీకృష్ణుడి జననము నుండీ వున్నవి [] ఎలాగూ చెప్పవచ్చునంటే చెరసాల యొక్క తాళాలు వాటంతట అవి తెరుచుకోగా వాసుదేవుడు చెరనుండి బయటికి వచ్చాడు అని వర్ణన వుంది [] దీన్ని బట్టి తాళం చెవులు పురాణ కాలంనుండీ ఉన్నాయని - అలనాటినుండీ తాళం చెవులను మెడలోని {పసుపు కొమ్ము బిగించిన} దారానికి స్త్రీలు కట్టు కుంటూ ఉండటంవల్ల మెడలోని పసుపు తాడు- మొదటగా తాళం తాడు అయ్యి చివరికి తాళి బొట్టు తాడు అయ్యి కూచుంది []

-----------------------------------------------------------------
వినోదినచండి -విమర్శలు వద్దు - దీనితో లోకానికి జరిగే అపచారం ఏమీ లేదు - సనాతన వాదులు గుండెలు పిండి చేసుకోవాల్సిన విషయమేమీ కాదు జనం మీ అబ్యభిప్రాయాలు నా అభిప్రాయాల వల్ల కాక కాల ప్రవాహ ప్రభావం వల్ల జీవిస్తూ వుంటారు
**HAVE A GOOD DAY**

------------------------------------------------------------------------

**పొలంతి పిశాచాల కథ 04-08-22 ,**
**written as a original by sree rama rkishna varanasi**
<> ఊరూ పేరు లేని ఒక కొండ మీద పాడు పడ్డ కోట ఒకటి వున్నది .{} అధికారంలో వున్న రాజులు తమ బద్ధ సెత్రువులను బందించి ఉంచుటకు , మరియు చిత్రవధలు చేయుటకు గాను ఈ కోటనే వాడుకొనే వారు {} వాడుక తక్కువ అవుట వల్ల ఈ కోట పాడు పడినది [] , ఈ కోటలోనే ఒక ఫది తాడి చెట్ల లోతున్న ఒక పాతాళ భావి వున్నది {} . కోటలో భందించ బడినవారిని చంప వలసి వచ్చినప్పుడు, ఆ మనిషి నడుముకు పెద్ద బండరాయి కట్టి ఈ నూతిలోకి పారవైచు చుండెడి వారు [] ఈ బావి గట్టు మీదనే మూడు పిశాచములు - కాళ్ళు ఊపుకొనుచూ కూచొని యుండెడివి []
**written as a original by sree rama rkishna varanasi**
<><> పొలంతి పిశాచముల వివరములు <><>

మూడు పిశాచములు వున్నవి అని చెప్పుకున్నాము కదా ?అవి పింగళంబులు , గుండింబులు , పిండింబులు - అను జాతికి చెందినవి [] ఈ మూడు జాతులనూ కలిపి పొలంతి పిశాచములు అని పాతాళ పిశాచ లోకమున పిలిచెదరు []
**written as a original by sree rama rkishna varanasi**
<><> రాజులకొలువులోలో విప్రవినోదులు , విదూషకులు ,కొంటె కోణంగులు వంటి వారు ఉందురు కదా [] వారు విచిత్రముగా ప్రవర్తించి వినోదములను సృష్టించి , రాజును ప్రజలను సంతోషపరచి - నవ్వించి - ఆనందింప చేసెదరు కదా ? ఈ పొలంతి పిశాచములు కూడా ఇటువంటివే [] వినోదములు కల్పించి, గమ్మత్తులు సృష్టించి - ఆ సంగతులను తమ పిశాచలోకమునకు - వినిపించి చెప్పి పిశాచలోకము వారిని అందరిని నవ్వించుచూ ఉండుటయే వీటి పని []
**written as a original by sree rama rkishna varanasi**
<>{}<> వెయ్యి-నొక్క దారము లను వుపయోగించి నేసిన బట్ట యొక్క మందము మరియు - వెడల్పు గల డబ్బు రంగు పిశాచములను పింగళంబులు ,అందురు [] వెయ్యి పదహారు దారములను వుపయోగించి నేసిన బట్ట యొక్క మందము వెడల్పు గల గబ్బు రంగు పిశాచములను గుండింబులు అందురు [] వెయ్యి నూట పదహారు దారము లను వుపయోగించి నేసిన బట్ట యొక్క మందము వెడల్పు గల పండు రంగు పిశాచములను పిండింబులు అందురు []
**written as a original by sree rama rkishna varanasi**
ఈ పొలంతి పిశాచములకు <><> "పాంగ్ డింగీలు" <><> అను ఆహారము చాలా ఇష్టము [] పిల్లలకు చేతిలో ఒక లడ్డూనో , అరిసనో , బూరెనో - జామపండునో, మామిడిపండునో పెట్టిన యెడల వారు వాటిని ఎంత ప్రీతిగా తిందురో - అంతే ప్రీతిగా ఈ పొలంతి పిశాచములు - పాంగ్ డింగీలను - కొరుక్కొనితింటూ , కారకరా

నములుతూ , కొంత తాయిలం క్రిందా మరునాటికి దాచుకొనుచూ, వినోద పూర్వకముగా కాలక్షేపము చేసెడివి [] ఇంతకూ పాంగ్ డింగులు అనగా ఏమిటంటే ? అవి బావిలో తోయపడి మరణించిన వారి పుర్రెలు [] బావిలోని శవము యొక్క పుర్రెను అమావాస్యనుండీ- పున్నమి వరకూ నీటిలో నాననిచ్చి - ఆ మరునాడు ఆ పుర్రెను బయటకు తీసి - దానిని ఈ పొలఁతి పిశాచములు - అపపురూపముగా తినుచుండెడివి [] written as a original by sree rama rkishna varanasi

ఈ కథలో లో మనము అనేక సార్లు పొలఁతి పిశాచములు అని చదువవలిసి రావచ్చును -- అందువలన వీటిని " పోపీలు " అన్న చిన్న పేరుతో పిలిచి గండము గట్టెక్కుదాము []
written as a original by sree rama rkishna varanasi
<> రాణీ భవనమునకు - కాళ్ళూ చేతులు వచ్చుట <> written as a original by sree rama rkishna varanasi
// అన్నయ్య రాజు యొక్క "పాంగ్ డింగీ" ని {అన్నయ్య రాజు యొక్క పుర్రెను} తెచ్చి తినుట కోసము అని - అమావాస్య తరువాత వచ్చు పున్నమి వరకూ వేచి చూసిన పొలఁతి పిశాచములు ఆమరునాడు భావి అడుగునకు వెళ్ళినవి [] కింద వున్న దృశ్యము చూసి వాటికి మతి పోయినది [] అక్కడ ఒక ముని ఎవ్వడో నీటి అడుగున నిలువబడి తన ఎదుట నిలువెత్తు అగ్నిని ప్రజ్వరిల్ల చేసుకొని - తపస్సు చేయుచున్నాడు [] అగ్ని వున్నచోట ప్రాణవాయువు వున్నట్లే కదా? ఈ ముని యొక్క మహిమ,- బావిలోని నీటి యంతటా విస్తరించి ఉన్నందువల్ల - బావినీటిలో నికి వేయబడ్డ అన్నయ్య రాజు, నీటి కారణంగా మరణించి వుండలేదు - పైపెచ్చు ఒక తాబేలు వలె నీటి లోపలనే జీవించి వున్నాడు [] ఈ అన్నయ్య రాజు ఇనుప సంకెళ్లతో చుట్టపడి పెద్ద దుంగ వలే ఆముని పాదాల వద్ద పడివున్నాడు [] written as a original by sree rama rkishna varanasi

పొ పిలు నీటిలోకి వచ్చిన సమయములోనే - మునికూడా తాను చాలారోజులుగా చేయుచున్న తపము చాలించి కళ్ళు తెరిచి నాడు [] దివ్యదృష్టితో సంగతులెల్ల గ్రహించి - అన్నయ్య రాజు కట్లు విప్పదీసి " మీరు ఈ మనిషిని బయటికి చేర్చి - అతనికి సుఖ సౌకర్యాలు ఏర్పాటు చేయండి " అని పొ పి లకు ఆజ్ఞ నిచ్చాడు [] ఆ ముని ఇంకా ఇట్లా చెప్పాడు " నేను పాతాళ మార్గము ద్వారా కాశీ పోవుచున్నాను - కొద్దిరోజులుగా యిక్కడ విడిసి తపము ఆచరించినాను . మరి నేనిప్పుడు కాశీ పోవుచున్నాను - మరలి వచ్చి ఈ రాజుకు తగిన సాయము చేసెదను" అని చెప్పి వెడలి పొయను
<><> పోపిలు అన్నయ్య రాజును సజీవునిగా భావిపై కి తెచ్చి పాడు బడిన కోటను శుభ్రము చేసి అందులో రాజునకు వసతి కల్పించినవి [] అన్నయ్య రాజు గొప్ప శివ భక్తుడు [] అతడు ఆ పాడుబడిన కోటలోనున్న శిధిలా వస్తకు చేరుచున్న ఒక శివాలయమును కనుగొనెను [] రాజు తన స్వహస్త ములతో ఆ ఆలయమును పునరుద్ధ రించ పూనుకొనెను - అనగా జారీ కింద పడ్డ రాళ్లను తిరిగి నిలబెట్టి - ఆలయమునకు ఒక రూపు కల్పించ సాగెను [] నిత్యమూ శివపూజ చేయ సాగెను [] ఈ ఆలయ పునరుద్ధారణ వల్ల రాజునకు శరీరము బడలిక చెంద సాగినది [] రాజు యొక్క బడలిక పోగొట్టుటకు అని మన పొలఁతి పిశాచములు - రాజు ఆదమరిచి నిద్రపోవు సమయమున - అతని కాళ్ళు చేతులు తలను , మొండెమునుండి విడతీసి రాణీ మందిరమునకు తెచ్చి - రాణీచే రాజు కాళ్ళు నొక్కించుట,

బొబ్బలెక్కినరాజు అరచేతులు కి మందు తైలములు రాయించుట ,
దుమ్ముకొట్టుకుపోయిన తల ను శుభ్రముగా చేయించుట వంటివి చేయించి తిరిగి వెనుకకు తీసికొన పో సాగినవి
[] మీరు అనవచ్చు పిశాచములు నేరుగా రాజునే - రాణీ మందిరమునకు ఎందుకు చేర్చలేదు? ? అనిwritten as a original by sree rama rkishna varanasi [] ఈ పోపి లకు వినోదము సృష్టించుట ఇష్టముఅని చెప్పుకొన్నాము కదా ?అందుకని అవి రాజు కాళ్ళు చేతులు తల పీకుకొని వెళ్లి అతని భార్యయగు రాణికి ఇచ్చిన ఆమె మరియు ఆమె పరివారము ఎట్లు స్పందింతురు? ఏ విధముగా దడిచి చచ్చెదరు ? ఎవరు భయముతో మూర్చ పోవుదురు ? ఏవిధముగా గగ్గోలు పడెదరు ? ఎవరు ఎట్లు ఏడ్చెదరు ?ఎవరికి పిచ్చి పట్టును ? ఎవతి ముఖ కవళికలు ఎట్లుండును ? వంటి విషయములు చూడవచ్చు నని- చూసినవిషయములను తమ పిశాచలోకమున చెప్పి తమ వారిని వినోదింప చేయవలెనన్న తలంపుతో పొ పి లు ఈ పని చేయుటకు ఉపక్రమించినవి []
written as a original by sree rama rkishna varanasi
వాటికి నిజముగానే ఈ పని చేతల్లో ఎంతో వి నో దము కాలక్షేపము దొరికినవి []
మొండెము లేని తన భర్త తలకు నూనెరాసి తలదువ్వి పంపుటకు రాణి ఆనందించినదా ? ఏడ్చినదా ? వంటివి మీరు కూడా ఆలోచించినచో మీకు కూడా ఎంతో వినోద కాలక్షేపము అగును

<><> ఇంతటితో మొదటి భాగము సమాప్తము []
written as a original by sree rama rkishna varanasi
<><> రొండోవ భాగము మొదలు <><>
అన్నయ్య రాజు కాళ్ళు చేతులు తన వదినగారి మందిరమునకు వచ్చి పోవుచూ వున్నవి అని తెలిసికొనినాక తమ్ముయ్య రాజు తన మంత్రులను వారి సలహామీదా కొందరు మంత్రవేత్తలను సమావేశపరిచి వారి సలహాలు అడిగెను [] మంత్రవేత్తలు అంజనము వేసి అన్నయ్య రాజు బ్రతికి ఎక్కడఉన్నదీ తమ్ముయ్య రాజుకు చెప్పిరి [] కానీ కావాలని ఉద్దేశ్య పూర్వకంగానే అన్నయ్య రాజుకు పాతాళ బావిలోని ముని కరుణ వున్నదని చెప్పుట దాటవేసిరి [] తమకు తగు బహుమతులు సంబారాములు ఇచ్చినచో , అన్నయ్యరాజును రక్షించి సజీవంగా ఒడ్డుకు చేర్చిన పిశాచములను తాము భండిచేదామని - మీరు మీ అన్నయ్యరాజును యుద్ధములో చంపవచ్చును " అని సలహా పలికిరి [] వీటన్నిటి వలన తమ్ముయ్యరాజు పెద్ద సైన్యమును సమకూర్చుకొని అన్నయ్య రాజు ను చంపవలెనని - అతడు వుండుచున్న కోటపైకి యుద్ధము చేయ వెడలెను [] మంత్రవేత్తలు ఆ సైన్యమును అనుసరించిరి []మంత్రవేత్తలు మహిమ హెకలవారే కానీ -పాతాళపు బావిలో నీటికి వున్నా మహాత్యమును వారు ఎరుగ లేకపోయిరి [] అందువల్ల పిశాచములు పగటి యిద్ధపు వేళ్ళ ఈ బావిలో దాగుకొని మంత్రవేత్తలకు చిక్కకుండా కాలము గడిపి written as a original by sree rama rkishna varanasi
రాత్రి వేళ్ళ బయటికి వచ్చి - ఏనుగు తొండములను రొండు పీలికలు చేయుట - గుఱ్ఱముల కాళ్ళను వెనక్కి తిప్పి పెట్టుట వంటి కొన్ని కొంటె పనులు చేసినవి []
ఇవి కాక ఏనుగులను - గుఱ్ఱములను - మనుషలను - అయస్కాంతమునకు - అయస్కాంతము - అయస్కాంతమునకు ఇనుపముక్కలు అంటుకు పోయినట్లు - ఒకదానికి ఒకటి ఆకర్షణతో అంటుకుపోవునట్లు - విడిపోవునట్లు చేసినవి [] ఇక ఈ

యుద్ధము గురించి చెప్పుకొని నవ్వుకొనుట పిశాచముల వంతు అయినది []written as a original by sree rama rkishna varanasi

తమ్మయ్య రాజు ఒడి పోయి అరణ్యములలోనికి పారిపోయినాడు [] ఈ యుద్ధం ముగియుచుండగా పాతాళ మార్గమున కాశీకి ఏగిన ముని తిరిగి వచ్చెను - అతడు భావి నీటిని చీల్చుకొని - నీటినుండీ బయటకు వచ్చు కొంగ పిట్ట వాలే బయటికి వచ్చెను [] ముని యుద్ధముతో జోక్యం చేసికొనక అన్నయ్య రాజు పునరుద్ధరించిన శివాలయమును చూసి మిక్కిలి సంతసించెను [] ఆ సంతోషముతో అనుగ్రహించి శివలింగము నుండీ ఒక నీటి ధార పైకి వచ్చునట్లు చేసి దానికి " అమరావతి అమర గంగా లింగేశ్వర స్వామీ" అని ఒక అని పేరు పెట్టి వెడలిపోయెను [] ఈ అమరావతి అమర గంగా లింగేశ్వర స్వామీ" లింగము నుండి వచ్చు నీటి వల్ల కోటలో నుండు వారికి చక్కని త్రాగు నీటి వసతి కలిగినది [] ఈ అమర గంగా లింగము నుండి వచ్చు నీరు కొండపైనుండి క్రిందకు జలపాతములు కట్టి పారి, అనేక వేల కొండ భూములను సారవంతమైన పంట నేలలుగా మార్చినవి [] ఈ నేలలను సాగుకు తీసుకొని జీవించుటకొరకు, ఎక్కడెక్కడి ప్రజలు అన్నయ్య రాజు దగ్గరికి వచ్చి - ఆయనకు కప్పములు కట్టి - ఆయన రాజ్య ప్రజలు అయ్యిరి [] రాజ్యమును సుసంపన్నము సుభిక్షమూ చేసిరి [] ఇక చెప్పవలసినది ఏమున్నది ? తమ్మయ్య రాజు రాజ్యము ఆనవాలు లేకుండా పోయినది []
written as a original by sree rama rkishna varanasi

<><> అన్నయ్య రాజు వినోదములు <><>

అన్నయ్య రాజు తన రాణీని వెంటనిడుకొని , అమావాస్య రాత్రి నాడు తన కోట బురుజు పై నిలుచుండి" "అదిగో ఆ మూల కనపడుచున్నంత మేర మన రాజ్యమే అని " చూపుడు వేలు తన ఇష్టము వచ్చిన మూల వేపు చూపించి రాణితో చెప్పెను []

అప్పుడు పొలంతి పిశాచములు - రాజు తన వేలిని చూపిన దిక్కులోని కనుచూపు మెఅవున్నా నేలనంతటిని - అతనికి స్వాధీన
పరచెడివి [] ఆ భూమి అతని స్వాధీనము అయినది అనుటకు గుర్తుగా ఆ ప్రాంతమునవున్న పెద్ద పెద్ద మర్రి చెట్లను, రావి చెట్లను - మెరుపు కాంతులతో మండించి -సరిహద్దులు చూపుచుండెడివి [] క్రమముగా అన్నయ్య రాజు ఆశకు అంతులేకపోయెను [] రాణీ గారు రోజుకొక చోట చొప్పున మెరుపుల వెలుగులు చూడ కోరెను [] ఈ రకముగా పొలంతి పిశాచములకు మొదట దొరికిన వినోదము నశించి - విసుగు జనినించినది []

<><>ఆగెనా ? ఊగెనా ? అన్న సంశయపు కథ <><>
written as a original by sree rama rkishna varanasi

వినోదము కోల్పోయి విసుగునులోనయిన పొలంతి పిశాచములు ఒకనాడు ఒక పెద్ద కొండా బండను ఏనుగుగా మార్చినవి [] ఈ ఏనుగు మొత్తమూ బండయేకానీ దాని తోక ఒక్కటి మాత్రమూ సజీవముగాఅటూ ఇటూ వూగుచుండెడిది [] ఈ ఏనుగును సృష్టించిన పిమ్మట పొలంతి పిశాచములు రాజును కలసి " నీ బాగోగులు చూసుకోవలసినదని మాకు ముని ఆజ్ఞ అయినందున మేము నిన్ను విడిచి పోలేకున్నాము [] కానీ నీవు మానవమాత్రుడవు [] నీవు ఈ లోకము విడిచి పోకతప్పదు [] నీకోసము అని ఒక ఏనుగాను సృష్టి చేసినాము [] దాని తోక అటూ ఇటూ వూగుచుండును [] ఆ తోక ఊగుట ఆగి పోయిన గంట లోపున నీవు ఈ లోకము

వీడి పొదువు" అని చెప్పినవి [] ఇక ఆనాటి నుండీ అన్నయ్య రాజు ఇతర ఆలోచనలు - రాజ్య కాంక్షా మాని " తోక ఊగినదా ? ఆగినదా ? అని ఆలోచించించుకొనసాగేను [] అంతే కాక -- " మీరు వెళ్లి " తోక ఊగినదా ?ఆగినదా ? అన్నది చూసిరమ్మనమని రాణులను మంత్రులను అడగ సాగెను [][][]
" తోక వూగుచూనే వున్నది " అని ఎవరు ఎంత నమ్మకముగా చెప్పినను రాజుకు నమ్మకము కలుగకుండెను [] ఒకే విషయము గురించి వంద సార్లు నమ్మ పలుకుట ఎవరికైననూ దుస్సాధ్యమే కదా ? అందుచేత " ఊగినదా - ఆగినదా ? అన్న ప్రశ్న అడిగించుకున్నవారు - రాజుకు నమ్మకము కలుగునట్లు సమాధానము చెప్పుట కు విరమించుకొని - ముసి ముసి నవ్వులు నవ్వసాగిరి [] వీరి ముసి ముసి నవ్వులు చూసి, ఆ నవ్వులను చూసి రాజు పొందు భయమును చూసి , రాజు పొందు భయమును చూసి యువరాజు పడు ఆశను చూసి - రాజు ఎప్పుడు చనిపోవునో - అతనితో పాటుగా మేముకూడా ఎప్పుడు సహగమనము చేయవలసి వచ్చునో అని రాణులు పడు భయములను చూసి, పొలంతి పిశాచములు ఎప్పటి లెక్క తమ వినో దములను అనుభవించినవి []
written as a original by sree rama rkishna varanasi
చివరికి అన్నయ్య రాజు ఇతరుల మాట యందు నమ్మకము లేక ప్రతి నిత్యమూ స్వయముగా తానె ఏనుగు దెగ్గరికి వెళ్లి చూడ సాగెను [] ఒక నాడు ఆయనకు ఏనుగు తోక ఊగుటలేదు అని భ్రమ కలిగి - తన చేతితో ఆ ఏనుగు తోకను పట్టుకొని ఊపేను [] ఆ మరు క్షణము రాజు యొక్క చేయి తప్ప మిగతా దేహమంతయూ రాతిగా మారి పోయినది []
పై సంగతి తరువాత రాజు మరణించాడు అనుటకు వీలు కలుగలేదు ఎందుకనగా అతని చేయి కదులుచూ నే వున్నది [] చివరికి మిగిలిన జటిల సమస్య ఏమిటంటే ? ఏనుగు తోక వూపుటచే రాజు చేయి కదులుచున్నదా ? లేక ప్రాణములు దక్కించుకొనుటకై రాజే ఏనుగు తోకను వూపుచున్నాడా ? అని? []
<><><> ఈ వింతను చూసి విశ్లేషించుటకు ఎక్కడెక్కడి రాజ్య ప్రజలూ అన్నయ్య రాజ్యమునకువినోదార్ధము పిల్లా పాపాలను వెంటనేసుకొని వచ్చిరి [] వీరు చూపు హావభావాలు - ధరించు దుస్తులు - వారు పాడు పాటలు , వారు తమ పిల్లల నోటిలో కుక్కి కుక్కి
తిండి పెట్టుట వంటి విషయములు చూసి, మన పొలంతి విశాచములు ఎంతగానో వినోద కాలక్షేపము చేయు చుండెను
{}{}{}{} written as a original by sree rama rkishna varanasi
మనము మొదటిలో చెప్పుకొనిన ఊరి పేరు లేని కోట నేడు ఎక్కడ వున్నదీ అన్నసంగతి శాటిలైట్ ద్వారాగ కాని పెట్టినాచొ - తోకనుం వూపుచున్న రాతి ఏనుగు , తన చేతిని కదుపుచున్న రాతి రాజు ఏకాదవున్నదీ నేడు మనకు కనపడవచ్చును - ఏనుగు తోక కకదలికలకు రాజు చేయి కదులుచున్నదా? లేక రాజు చేతి ఊపుకు ఏనుగు తోక కదులు చున్నదా ? అని అలోచించి మనము వింత ముఖములు పెట్టగా ? చూచి ఆనందించుటకు - ఈ పొలంతి పిశాచములు నేటికీ ఇంకనూ అక్కడనే ఉండి ఉండవచ్చు - ఏమందురు ? written as a original by sree rama rkishna varanasi
=====================================
మొత్తము కధ సమాప్తము - కాశీ మజిలీ కథను దాటించి మరొక కథను రాసాను అని అనిపించింది [] ఈ కధ మీకు నచ్చినను లేదా నచ్చక పోయినను - మొత్తము మీదా ఈ కధ రాయగలిగిన శక్తిని సెక్తిని నాకు ఇచ్చిన -- ఆ కాశీ విశ్వేశ్వరునికీ - విశాలాక్షి

తల్లికీ నా - వంగిడీలు []
----------------------------------------------------------------------
{}{}శరణం భవ కరుణాకర -
శరణం భవ మాతే - కా అన్నపూర్ణేశ్వరీ []
------------------------------------------------------------------------
++++++++++++++++++++====================================+++++++++++
సార్ /మేడం నమస్కారం - మేము బ్రాహ్మణులము - మా అబ్బాయి సాఫ్ట్ వేర్ ఇంజినీర్ /బెంగుళూరులోవున్నాడు/ DOB = 25 మార్చ్ 1991 12లక్షలప్యాకేజీ [] మీకు తెలిసి వరుని కోసము వెతుకుచున్న బ్రాహ్మణ వధువుతల్లి తండ్రులు ఎవరన్నా వున్న యెడల వారికి మా ఫోను నెంబర్ 9908482191 . ను ఐసీసీ - మేము వధువును వెతుకుకొనుటలో సహాయపడగలరని కోరుచున్నాను -పూర్ పీపుల్ అయినా సరే [] మమ్మ్మ సంప్రదించిన వారికి వివరాలు అంద చేస్తాము - దయచేసి మీరేమీ అనుకోవద్దు - మీమీద భాద్యత పెట్టలేదు - నా కు తోచిన ప్రయత్నం నేను చేస్తూ వున్నానని తెలుపుకుంటున్నాను
+++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++++==++++++
పెళ్లి బస్సు కథ <> 28-07-22<>

సూరపనేని ట్రావెల్స్ ఆయన మాకు శిష్య పరమాణువు [] ఆయన ఒకనాడు నాకు కబురెట్టి
" ఏమండీ మన హైద్రాబాదు నుండి బెంగుళూరు తిరిగే బస్సు ఒక్కటి మూల పడిందండి . తాంబూలంలో పెట్టి మీకిస్తాను మీరు వేసుకోండి " అని చెప్పి ఆ బస్సు తాళాలు తాంబూలంలో పెట్టి - ఆ బస్సు మీదే ముప్పై ఏళ్లు డ్రైవర్ గా పని చేసిన "గుభెలయ్య" ను కూడా నా చేతిలో పెట్టాడు [] తెల్ల ఏనుగు దొరికింది [] తెలివికి లొంగనిది ఏమీ ఉండదు []
బస్సును బాగా పరిశీలించాను [] రెండు ఇంటూ రెండు గా నలభై ఎనిమిది సీట్ల బస్సు [] పనిచేస్తూ పని చేయని ఏసీ వుంది []"ఒక రోజులో రాను పోను 300 కిలోమీటర్లు దాటితే మన బస్సు బబ్బుంతాదండి " అని గుభెలయ్య నాకు తెలిపాడు [] మనసులోని ఆలోచన చేసి దాని ప్రకారం మా బెంగుళూరు బస్సును పెళ్లి బస్సుగా మార్చాను .
<><><>
మా బస్సునుదుట న "పెళ్లి బస్సు హైద్రాబాదు టూ శ్రీశైలం ఫారెస్ట్ " అని బోర్డు పెట్టాము [] బస్సుని తీసుకెళ్లి ఓ మూల సందులో - ట్రాఫిక్ వాళ్ళు వచ్చి చలాను వేయని -ప్రాంతంలో పార్కింగ్ చేసాము [] మీరు పిండివలస గ్రామంనుండి జియ్యమ్మ వలస గ్రామానికి పోవాల్సి వచ్చింది - అప్పుడు ఈ రెండు ఊర్ల మధ్య తిరిగే ట్రాక్టర్ దగ్గరికి మీరు పోవాలి - అంతే గానీ అది మీ దగ్గరికి రాదు [] అది ఊరి మొదట్లోఏ చేని పక్కనో ఆగి ఉంటుంది [] ఎత్తగొట్లా గమ్యం చేరుకోవాలన్న నిర్ణయం ఉంటేనే ట్రాక్టర్ ప్రయాణం చేస్తాము [] మా బస్సును సందీ - గొందీల్లో పెట్టటం లోని కాన్సెప్ట్ ఇదేనూ [] మా అవసరం వున్నవాడు మాత్రమే మనదెగ్గిరికి రావాలి - ఏదో వున్నది కదా? -ఎక్కేద్దాము అనుకునే వాడితో మనకు పనిలేదు [] మా బస్సులో ఇరవై మంది అమ్మాయిలకి - ఇరవై మంది అబ్బాయిలకి టికెట్లు ఇస్తాము [] మాకింకా పెళ్లి కాలేదని వాళ్లు డిక్లరేషన్ ఇవ్వాలి [] ఏజ్ ప్రూఫ్, అడ్రెస్స్ ప్రూఫ్ కి

ఆధార్ కార్డు చూపాలి [] బస్సులో ఇద్దరు జామా జెట్టెలవంటి రిటైర్డ్ మిలిటరీ వారిని సెక్యూరిటీ గార్డ్స్ గా కూడా పెట్టాము- []
టికెట్ ఇచ్చే ముందు చిన్న ఇంటర్వ్యూ కూడా పెట్టాము [] మా బస్సు ఎక్కటానికి వచ్చిన యువతీ యువకుల్ని ఇంటర్వ్యూ చేసి " మేము పెళ్లి చేసుకుందాము అనుకుంటూ వున్నాము - కానీ అవీ ఇవీ అని చెప్పి మా అమ్మానాన్నవాళ్ళు పడనివ్వటం లేదు- కాలం కరిగించేస్తున్నారు [] మా ఊహలు మా ఆశలు మాకున్నవి - దానికి అనుగుణంగా ఏమీ జరగటంలేదు [] పెళ్ళిఅంటే ఏమిటో ఎవరిని చేసుకోవాలో , ఎల్లా బ్రతకాలో మాకూ తెలుసు [], మా వయస్సులోని పులుసు అయిపోతున్నది ఈలోపే పెళ్లి చేసుకుంటాము " అని అభిప్రాయం వెలిపుచ్చిన వారికి మాత్రమే సీట్లు రిజర్వు చేసాము [] ప్రచారం తక్కువ అవటం వల్ల మొదట సారి బస్సు నిండటానికి మూడు వారాలు పట్టింది [] చెప్పటం మరిచాను - ఆకతాయి వెధవలని దూరంగా ఉంచటానికి టికెట్ ధర రొండువేలు పెట్టాము [] జర్నీ సుఖాంతం అయితే ఆ రెండువేలూ రిఫండ్ అన్నాము[]
<><><>
ఒక ఆదివారం నాడు మాపెళ్లి బస్సును బయలుదేరదీసాము [] పైప్రకారం గా సెలెక్ట్ అయినా ఇరవై మంది అమ్మాయిలను - ఇరవై మంది అబ్బాయిలను బస్సులో ఎక్కించుకుని ---దుగ్ దుగ్ లాడుతూ బస్సుని తీసుకెళ్లి శ్రీశైలం అడవిలో ఆపాము [] అందర్నీ కిందకు దింపి వదిలేసి - "మిట్ట మధ్యాన్నానికి ఏదన్నా తింటానికి రండి" అని చెప్పాము [] మధ్యానానికల్లా - గుభెలయ్య ఇంత ఉపమా తిప్పి పడేసాడు- అందులోకి చింతచిగుబు పులుసు పెట్టాడు [] మధ్యాన్నానికి కొందరు యువతీ యువకులు చేతులు కలిపి పట్టుకొని నడుస్తూ తిరిగి వచ్చారు [] వాళ్ళు ఇప్పుడే ఇక్కడే , నడుస్తూ నడుస్తూ మనసులు ముడివేసుకుని ప్రేమికులు అయినారన్న మాట [] అబ్బాయి పట్ల ప్రేమ జనించిన అమ్మాయిలు - మేము వండిన ఉపమా చూసి మొహం మాడ్చుకొని , తమ హ్యాండ్ బ్యాగ్ లు తెరిచి లంచ్ బాక్స్ లు తీసి అందులోది తమ అబ్బాయిలకు గోరుముద్దలు తినిపించారు [] అబ్బాయిలకి కిస్సుమీ నాట్ బ్రాండ్ చాకోలెట్లుకూడా ఇచ్చారు [] "లంచు అయ్యిందిగదా - అటు ఆ పడమట దిక్కుగా పోయి సంధ్యా సమయానికి తిరిగి రండి - తిరుగు హైదెరాబాదు పోదము" అని చెప్పి వాళ్ళని మళ్ళా అడవిలోని వంటరి తనంలోనికి తోలివేసాము [] సాయంత్రం వేళకి మరి కొందరు యువతీ యువకులు చేతులు చేతులు కలుపుకొని " ఇది పడమటి సంధ్యా రాగం - ఇది తొలి వలపు వసంతం" అని పాడుకుంటూ తిరిగొచ్చారు [] చేయి చేయి పట్టుకున్న అమ్మాయిలు అబ్బాయిల జంటను కూచోపెట్టి " నేను ఈ అమ్మాయిని పెళ్లి చేసుకుంటాను - నేను ఈ అబ్బాయిని పెళ్లి చేసుకుంటాను " అని పెళ్లి ప్రమాణాలు చేయించాము [] ఇవే ప్రమాణాలను తగిన విధంగా కాగితాలమీద రాయించి సంతకాలు కూడా తీసుకున్నాము [] ప్రొద్దుట మా బస్సు బయలు దేరినపుడు , అమ్మాయిలు ఒక వరుసలో అబ్బాయిలు ఒకవరుసలో కూచున్నారు [] ఇప్పుడు అల్లా కాక జంటలు కట్టినవారు పక్క పక్క సీట్లలో కూచొని - ఒకరి భుజాలమీద ఒకరు తలపెట్టుకున్నారు [] ఈ రకంగా మా పెళ్లి బస్సు మొదటి ట్రిప్పులో నే ఇరవై మందికి వివాహం ఫిక్స్ అయ్యింది [] మా ఘనకార్యం ఊరూరా పాకింది [] ఇప్పుడు మా బసుకి టిక్కెట్లు ఆరునెలల తరువాతగాని దొరకటం లేదు [] ఒకసారి బస్సెక్కి ఒంటరిగా దిగినవారికి మరో ఆరునెలలవరకు బస్సు ఎక్కే ఎలిజిబిలిటీ లేదు అని పెట్టాము [] జతగా దిగిన వారికి టిక్కెట్ డబ్బు వాపసు ఇచ్చి " అగ్నిపథ శాస్త్రి " గారి బహుమానంగా పెళ్ళిలో చదివింపులు చదివించుకోండి అని చెప్పాము []

<><><>
ఇది పెళ్లి వారి బస్సు కథ [] వారణాసి శ్రీ రామ కృష్ణ యొక్క సొంత రచన []
పూర్వం స్వయం వరాలు ఉన్నట్లు - నేడుకూడా అలంటి అవకాశం ఏదన్న కల్పిస్తే - ఇంతమంది యువతీ యువకులు పెళ్లి పెళ్లి అని ఏడ్చి గీపెట్టారు కదా ? అని అలోచించి ఈ బస్సుకు రూపకల్పన చేసాను
<><><>
సరే ఈ విధంగా -- మా కాలం, కల్యాణ కాంతులతో గడుస్తూ గడుస్తూ--- మా పెళ్లి బస్సు సక్సెస్ మీద సక్సెస్ అవుతూ ఉంటే - కొందరొచ్చి" ఒకబస్సు చాలటం లేదు శని ఆదివారాల్లో రోజుకు మూడు బస్సులు పెట్టండి"అని విన్నవించారు [] మా పెళ్లి బస్సు సక్సెస్ అయ్యింది అంతానికి ఇంతకన్నా ఏమి కావాలి ?
<><><>
సరే మనము మర్చి పోయిన వారు ఒకరున్నారు - వారు వచ్చి " రొండు వేలు కాదు పదివేలు కాదు యాభై వేల టికెట్ పెట్టండి [] అంతటి టికెట్ కొనే స్తోమత వున్నా వాళ్ళతోనే మా పిల్లలను బస్సు ఎక్కిస్తాము మా హొదా నిలబడుతుంది- మా అసలు నెరవేరు తావి - మాకలలు పండుతావి " అని అడిగారు [] " అయితే ఎక్కండి " అని వారిని- అంటే పిల్లల తల్లిని తండ్రినిమాత్రమే నమ్మకంగా బస్సు ఎక్కించి శ్రీశైలం అడవుల్లో నడిమధ్యకు తీసుకెళ్లి వదిలేసి వచ్చాము [] వాళ్ళు తిరిగి వచ్చేసరికి వారి పిల్లలు తమకు ఇష్టమైన వారిని పెళ్లిచేసుకున్నారని పేపర్లో వార్తలు వచ్చాయి [] వీరు తిరిగొచ్చే లోపే వారు కార్యాలు కూడా పూర్తి చేసుకున్నారు .
<><><><><><> <><><><><>
ఇప్పుడు జీవించి లేని," లేని పల్లి - అగ్ని పతాక శాస్త్రి " గారి సద్గురు చరణాలకు ఇది అంకితము
===============
మూడు ముక్కల లో పెళ్లి 23=07-21
తండ్రి కొడుకుతో - " నాయనా నేను చెప్పిన అమ్మాయిని పెళ్లి చేసుకోరా "
కొడుకు " కుదరదు డాడీ - ఒక అమ్మాయిని లవ్వు చేస్తున్న - ఆ అమ్మాయి షాప్ లో సేల్స్ గర్ల్ . మరి నామొహానికి అంతకన్నా గతి లేదు "
"కానీ నేను చెప్పే అమ్మాయి పెద్ద సాఫ్ట్ వెర్ కంపెనీ ఇమ్మోసిస్ యజమాని కూతురు "
కొడుకు " అయితేప్రయత్నించు డాడీ "
అప్పుడుఅబ్బాయి తండ్రి ,{ ఈయనకు బాగా డబ్బు ఉద్యోగ హొదా డాబు దర్పము వున్నాయి } తన ఉద్యోగ హొదా వుపయోగించి ఆ ఇమ్మోసిస్ కంపెనీ ఓనర్ దగ్గరికి వెళ్లి " మా అబ్బాయికి మీ పిల్లనివ్వండి "
"కుదరదు"
" మావాడు రిజర్వు బ్యాంకు లో లోన్స్ సెక్షన్ ఆఫీసర్ - కోరినంత లోను ఇప్పిస్తాడు - అడిగినంత మాఫీ చేయిస్తాడు "
" అయితే ఒకే "
తండ్రి రిజర్వు బ్యాంకు గవర్నర్ దెగ్గరికి వెళ్ళాడు-{ఆయన ఇప్పుడు కూడా అధికార పరిచయాలు ఉపయోగించాడు } అప్పుడు ఆయన వెయ్యి రూపాయల నోటు మీద సంతకాలు చేస్తున్నాడు " మావాడికి మీ బ్యాంకు లో ఆఫీసర్ పోస్ట్ ఇవ్వండి - మా వాడు హార్వార్డ్ లో ఎకానమీ చదివాడు "
" కుదరదండీ "

" ఒకే ఆలోచించుకోండి - మావాడు ఇమ్మోసిస్ వారి అల్లుడు - కంపెనీకి కాబోయే యజమాని. . మీరు నో అంటే మీరిచ్చిన 48 వేలకోట్ల లోన్లు తీర్చే ప్రసక్తే రాదు - కంపెనీని దివాళా తీయిస్తాము "
"అయితే వచ్చి జాయిన్ ఆవ మనండి "
అంతే మూడు ముక్కలలో పెళ్లి అయిపొయింది
[]{}{}{}{}{}[][][]{}{}{}{}[][][][]
అబ్బాయి నిజంగానే హార్వార్డ్ నుండి ఎకానమీ చదివి , పెద్ద ఫైనాన్స్ కంపెనీలో 60 లక్షల ప్యాకు మీద వున్నాడు [] పిల్లాడికి పెళ్లి కావటం లేదని తండ్రి ముచ్చటగా మూడు అబద్దాలు ఆడి పెళ్లి జరిపించాడు [] పెళ్లి చేయటానికి అబద్దాలే కావాలే - నీతి నిజాయితీలు ఇక్కడ ఎందుకూ పనికి రావు
నూరు అబద్దాలు ఆడి అయినా ఒక పెళ్లి చేయమని ఒక సామెత వుంది - దీన్ని తిరగా మారగా వేసి చూస్తే ఏమి తేలుతుందంటే నిజం నిజాయితీ తో మాట్లాడితే సంభందాలు ఫిక్స్ కావు అని [] నిజాయితీ నిజమూ కల సంబంధాలకు ఆడపిల్ల తల్లి తండ్రులు ఒప్పుకోరు - ఎందుకంటే అందులో తీపి ఉండదు - పైగా వగరు { వగరు కాదు అంతే పొగరు }అనిపిస్తాయి [] ఎంతో ప్రచార ఆర్భాటము , బీల్డప్ లు ఇచ్చి , అబద్దాలతో స్వర్గం.చూపెట్టి వంగి వంగి సలాములు చేసిన వారి కంపెనీలోనే జనం కోట్లు పెట్టుబడి పెట్టి ఆనందిస్తారు చూశారూ, -అల్లాగే చివరికి పెళ్లిళ్లు కూడా చేసి " మమ్మల్ని మా పిల్లని మోసం చేశారని కోర్టుకు వెడతారు - అబ్బాయి కొజ్జవాడని తెలుసుకోలేక పోయాం అని బంధు మిత్రులతో చెప్పి భాద పడతారు []
అబద్దానికి చికెన్ బిర్యానీకన్న ఎక్కువ రుచి ఉంటుంది - అమృతం కన్నా ఎక్కువ తియ్యదనం ఉంటుంది [] ఇదే ఈ ఈ సంగతి లోని నీతి []

====================================
>>>సన్యాసి కధ <>>> WITH 99.5 % COMPLEATION
ఒక సన్యాసి దారి వెంట వెడుతూ వున్నాడు [] అతనికి ఒక నియమము వున్నది [] దాని ప్రకారము అతడు మధ్యాన్నపు భోజనపు వేళ నాలుగు ఇళ్ల ముందు మాత్రమే ఆగి బిక్ష అడిగి - అలా దొరికింది మాత్రమే తింటూ ఉంటాడు [] అతడు ఒక నాడు వున్న గ్రామంలో మరు నాడు ఉండకుండా ముందుకు సాగుతూ ఉంటాడు [] అతడు ఒకనాడు ఒక ఇంటివద్ద నిలబడి బిక్ష అడిగాడు [] అంతకు మునుపు అతడు మూడు ఇళ్లలో బిక్ష సేకరించాడు [] వారు అందరూ పప్పు , పచ్చడి, అన్నము, పాయసము తీపి పిండి వంటలు కల ఆహారము అతని జోలెలో వేశారు [] తనకు వున్నా నియమాలను అనుసరించి ఈ సన్యాసి నాలుగో ఇంటి ముందు కూడా నిలబడి బిక్ష అడిగాడు [] ఆ సమయములో ఆ యింటిలోని ఒక చిన్న పిల్ల మట్టిని చిన్న ఉండలుగా చేసి అదే అన్నము ,పప్పు, అంటూ మర్రి ఆకులలో పెట్టి - దానిని తన తోటి సాహవాస గత్తెలకువడ్డిస్తూ వున్నది [] ఆ పిల్ల ఈ బిక్షుని పిలుపు విని - ఒక పెద్ద రావి ఆకులో మట్టి ఉండలు ఉంచి - ఇదిగో అన్నము , ఇదిగో పప్పు , ఇదిగో లడ్డూ- అంటూ పెద్ద పెద్ద మట్టి ఉండలు బిక్షకుని జోలెలో వేసింది [] భిక్షుకుడు బుధ్ధ బోధనల ప్రకారము శాంతము అవలంభించి ముందుకు కదిలి - ఒక చెరువు గట్టున , చెట్టు కింద విడిసి - అన్నములో పడ్డ మట్టి వుండలతో కలిపి మొత్తము ఒక ముద్దగా పిసుక్కోని - అందులో కొంత - పక్షులకు మరియు జంతువులకూ కేటాయిస్తూ ఒక బండ మీద పెట్టి మిగిలింది తానూ తిన్నాడు [] బండమీద పెట్టిన అన్నము ను ఆశించి ఒక నల్ల కుక్క వచ్చింది []

అది కొద్దిరోజులుగా నిరాహారంగా వుంది [] అది భిక్షువు పెట్టిన మట్టి కలిసిన అన్నము తిన్నది [] ఆ నిముషము తరువాత అది మనుష్య భాషలో మాట్లాడ సాగింది []
" తమరు ఎక్కడిదాకా వెడుతున్నారు ? నన్ను మీ వెంటరావా టానికి అనుమతిస్తారా ? అని కుక్క అడిగింది [] భిక్షువు కుక్కకు తన అనుమతి నిచ్చాడు [] ఇరువురూ కలిసి ముందుకు కదిలారు []
WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA
<<<<కధలోని నల్ల కుక్క కథ>>>
ఇరువురూ కలిసి ముందుకు సాగుతుండగా ----ఒక గ్రామమును సమీపించినప్పుడు కుక్క ఘోరంగా అరుస్తూ పొలంలో పని చేసుకుంటూ వున్నా ఒక రైతు మీదకి పరుగులెత్తింది [] రైతు కంగారు పడి పొలాల మధ్యగా పరుగెత్తి , ఆ పొలంలోనే ఉండి ఎలుకలను వేటాడుచున్న ఒక్క త్రాచుపాముతోకను తొక్కాడు [] దానితోఆ పాము కరువగా అతడు తక్షణమే మృతి చెందాడు -----౦౦---మరొక గ్రామము సమీపించగానే కుక్క అరుస్తూ ఒక దున్నపోతుని బెదిరించి దాన్ని భయపెట్టి అది ప్రాణ భయంతో పరిగెత్తు నట్లు చేసింది[] దున్నపోతు పిచ్చిగా పరుగుపెట్టుచూ వెళ్లి ఒక నిండు చూలాలిని ఢీకొంది [] ఆమె మరణించింది - కానీ అంతకు కొద్దీ క్షణాలమునుపే ఆమె గర్భంలో వున్నా శిశువు - జారి నేలమీద పడి కెవ్వుమన్నాడు---౦౦---ఇంకొక గ్రామము సమీపించినప్పుడు కుక్క, ఒక కుఱ్ఱ వాడిని తరిమింది " ఆ పిల్ల వాడు తల్లి తండ్రులకు తెలియకుండా , గడ్డి వాము పక్కన నిలబడి చుట్ట వెలిగించి , ధూమ పానము చేస్తూ వున్నాడు [] కుక్క అరుపులతో అతడు బెదిరి పరిగెత్తుతూ, తన చేతిలోని చుట్టముక్కసంగతి ఎవరూ గమనించకూడదు అని భావించి , దాన్ని విసిరి వేయగా అది నేరుగా వెళ్లి గడ్డి వాములో పడి , గడ్డివాము తగులబడింది - గాలి వాలుకు , మరియు వేగానికి ఆమండుచున్న ఎండుగడ్డి గాలిలో తేలియాడుతూ ఊరిలోని పూరి గుడిసెల మీద పడి - వూరు మొత్తము తగులబడింది - అప్పుడు కొన్ని పశువులు ఫది ముగ్గురు మానవులు అగ్నికి ఆహుతి అయి మరణించాబు[]
ఇదంతా చూసిన సన్యాసి కుక్కకు నమస్కరించి " అయ్యా ఇదంతా నీ సంకల్పముతోను - నీ ఇచ్ఛ మేరకును జరిగినట్లు తోస్తున్నది . మీరు ఎవరో నాకు ఎరుక పరచండి >అని ప్రార్ధించాడు []WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA
అప్పుడు నల్ల కుక్క తన దైన నిజ స్వరూపాన్ని ప్రదర్శించి " నేను మృత్యు దేవతకు నమ్మిన బంటునైన " కాల భైరవుడను . నా వల్లజరగ వలిసిన పనిని యమధర్మరాజు నాకు ఆదేశిస్తూ వుంటారు - వారి ఆజ్ఞ మేరకే జరిగినదంతా జరిగింది -జరుగుతుంది " అని చెప్పి తిరిగి నల్ల కుక్కగా మారి పోయాడు []
" మరి నా మృత్యువు యెట్లు రానున్నదో నాకు ఎరుక పరచగలవా ? అని సాధువు కుక్కను అడిగాడు
కుక్క చాలా సేపు తటపటాయించి చివరికి " నీవు ఒక ఆరునెలల కాలము లోపు ఒక రాజుచే వురి తీయపడి విచిత్ర మరణము పొందుదువు - నీకు నాకు గల స్నేహమును పునస్కరించుకొని చెప్పుచున్నాను " అని చెప్పి మౌనము దాల్చినది []
అప్పుడు సన్యాసి " ఈ దేశపు రాజు నేను బాల్య స్నేహితుడు . మేము శ్రీ కృష్ణుడూ కుచేలుడూ వంటి వారము [] నేను ఆరు నెలలు అతని అతిధిగా గడిపిన యెడల - నేను మృత్యువును తపిపంచుకొందునేమో ? ఆ వింతకూడా సాధింతును " అని

సంకల్పించి - ఆ దేశపు రాజుకు తాను వచ్చుచున్నట్లు కబురు పంపాడు []
WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA {}
బుద్ధుడు నడయాడినాడు అని చెప్ప పడుచున్న ఆ మరావతీ పట్టణాన్ని " వామన బుద్ధుడు " అనే పేరుకల రాజు పరిపాలిస్తూ వున్నాడు [] అతడు భక్తి ప్రపత్తులతోను - దాసదాసీ జనంతోను - రాణులను వెంటనిడుకొని శరణు ఘోష చేస్తూ సాధువుకు ఎదురు వచ్చి అతన్ని తన మందిరానికి కొని పోయాడు [] సన్యాసి రాజుకు కి తన మరణ వార్త చెప్పి " నీ వల్ల నాకేమీ ప్రాణ భయం లేకుండా భయము ఇవ్వు అని అడిగాడు []అప్పుడు రాజు తన మంత్రులను పిలిచి " ఇహనించీ ఇతడే మీరాజు - నేను అతని దాసుడను - ఎటువంటి స్థితిలోనూ మీరు నా ఆజ్ఞలు పాటించ వద్దు - అవి ఏవైనా సరే అని మంత్రులకు ఆజ్ఞలు ఇచ్చాడు [] సన్యాసి మనసు నిమ్మళించినది WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA
<>>> సన్యాసి మరిణించిన విధానము యొక్క కథ<>>>>>
సన్యాసి మృత్యు భయాన్నిమనస్సులోనుండి తప్పించుకునేందుకు యోగసాధన అవలంభించాడు - అతని సేవకునిగా నిజమైన రాజు రాజ్యము నడిపిస్తూ వున్నాడు[] సాధువు అతినిష్ఠతో నిరాహారంగా ఉంటూ " అవలోకితేశ్వరుడు " అనబడు ఒక బుద్ధ రూపాన్ని మనస్సులో నింపుకొని ధ్యానించ సాగాడు [] క్రమంగా అతని లోని మాంసము అంతా క్షీణించి కేవలము యెముకలూ. నరాలు కల మనిషిగా మారాడు [] అవలోకితేశ్వరుడి ప్రభావంవల్ల సన్యాసి పద్మాసనంలో కూర్చొనియె నేలనుండి పైకి లేచి గాలిలో తేలుతూ ఉండేవాడు [] ఒకనాడు అతడు ధ్యాన ముద్రనుండి నిద్రావస్తలోకి జారి పోయి గాలిలోనే పవ్వళించాడు [] చిగురుటాకు వృక్షము నుండి విడిపడి గాలి వాలుకు సాగి పోయి పోయి ఒక కుండలో పడినట్లు ఊహించుకోండి [] ఇదేవిధముగా సన్యాసి గాలిలో శయనించి గాలి వాలుకు పైకి లేచిన గాలి పటము వలె - గాలిలో ప్రయాణించి - చివరకు ధాన్య కటకం అను దానిని రాజధానిని చేసుకొని రాజ్యము ను ఏలుచున్న"ఆత్మ సుధా దత్తుడు " అనే రాజుయొక్క రాజమందిరానికి చేరాడు [] చేరి అదే పవ్వళించిన భంగిమలోనే - పోయి పోయి ఒక శయ్య మీద పడ్డాడు [] ఆ శయ్య అనగా మంచము ఆ రాజ్యపు రాణీగారిది[] ఆమె అప్పుడు ఆ శయ్య మీదనే పవ్వళించి వున్నది [] తల్లిని బిడ్డడు కౌగలించిన రీతిగా మన సన్యాసి అసంకల్పంగా రాణిని కౌగలించి నిద్రించసాగాడు []
ఎవరో ఒక పురుషుడు రాజమందిరము చొచ్చి రాణితో రమిస్తూ వున్నాడని సేవకులు రాజుకు కబురు అందించారు [] రాజు సుధా దత్తుడు వచ్చి కన్నులతో చూచి - ఆవేశపడి - అయినా కానీ తగిన విచారణ జరిపి - రాణినేరము ఏమీ లేదు అని గ్రహించి - " ఈ సన్యాసికి ఉరిశిక్ష వేయండి " అని ఆజ్ఞ చేసాడు
WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA
>><<> సన్యాసికి వురి శిక్ష అమలు జరిగిన కథ - <<>>>
ఇప్పుడు సన్యాసి సూత్రబద్ధంగా ఏ దేశానికి రాజుగా వున్నాడో ఆ అమరావతీ రాజ్యపు మంత్రులు, తమ రాజు అగు సన్యాసి రాజమందిరంలో కనపడక అతడు ఎక్కడున్నాడో కనిపెట్ట వలెనని పెద్ద సైన్యాన్ని - తీసుకొని వెతుకులాటకు వెళ్ళినారు [] వారు కొద్ది సేపటిలోనే , అంటే ఒక గుర్రపు దౌడు సమయంలోనే సన్యాసి శిక్షకు గురి అయిన ధాన్యకటకాన్ని చేరుకొని - ప్రజలలోని అలజడి కారణంగా - సన్యాసి ఇక్కడే ఉన్నాడని , సన్యాసి కి రాజు వురి శిక్ష వేసినాడనీ కొద్దీ సమయంలో సన్యాసి ఉరికంబం యెక్క బోతూ ఉన్నాడని తెలుసుకొని - ఆందోళన చెంది ధాన్యకటకపు రాజు అయినా సుధా దత్తుని కలిశారు [] కలిసిఆ రాజుతో " ఈ

సన్యాసి మా దేశపు రాజు . అందువల్ల మీరు సన్యాసికి మరణ శిక్ష విధించినచో అది మా రాజును హతమారిచినట్లు భావింప బడుతుంది . కాన మేము చూస్తూ ఊరుకోము .యుద్ధానికి సిద్ధ పదండి " అని " హెచ్చరిక చేశారు [] సుధా దత్తుడు స్వతహాగా మంచి రాజు . ధర్మములు తెలిసిన వాడు - తక్కువ సైన్యము వున్న వాడు [] ఆయన తన మంత్రులను సమావేశపరిచి యుద్ధము తప్పే ఉపాయము చెప్పమన్నాడు . [] అప్పుడు న్నా ఒక మంత్రి లేచి " అయ్యా రాణిగారుప్రజలముందుకు వచ్చి తన పట్ల అనుచితముగా ప్రవర్తించిన సన్యాసిని-- మన్నించి క్షమించాను అని ప్రకటన ఇప్పిస్తే , ఆ కారణంగా మనము సన్యాసిని ఊరివేయకుండా ఆప వచ్చు -- .రాణిని పిలిపించి ఆమెచే అతనికి క్షామాపణ ఇప్పించండి అన్నాడు [] రాణి పేరు లక్ష్మణ రే ఖ [] ఆమె వచ్చి రాజ్యానికి వాటిల్లిన యుద్ధ భీతిని , ఉరిశిక్ష అమలు చేయకుండా సన్యాసిని అప్పగించితే తన భర్తకు రాగల అపఖ్యాతిని లెక్కవేసుకొని " నాధా - సన్యాసిని వురి తీయకుండా వదిలివేస్తే - అతడు నాప్రియుడు అయ్యినందువల్లనే నేను అతడిని విడిచిపుచ్చాను అని లోకులు అనుకుంటారు - నా ప్రతివత్యా ధర్మానికి కళంకం కలుగుతుంది [] అందువల్ల మీరు ఉరిశిక్ష అమలు పరచండి [] కానీ సన్యాసిని గట్టి తాటితో కాక ఒక దారంతో ఉరితీయండి - అప్పుడు వురి వేసి నట్లుగానూ ఉంటుంది అతడు మరణించకుండా చూసి నట్లూ అవుతుంది " అని చెప్పి అందరినీ ఒప్పించింది [] ఒప్పించి , తన జడ లో వున్న ఒక పూల మాలను బయటికి లాగి , దానిలోనుండి దారమును విడిపరిచి " ఇదిగో దారము దీనితో ఉరితీయండి అని చెప్పి వెళ్లి పోయింది [] తన తలలోని పూల దారము తీసి ఇవ్వటంలో రాణికి ప్రత్యేకించి ఏ ఉద్దేశ్యమూ లేదు [] దీనితో అందరూ సంతోషించి, సన్యాసిని దారంతో ఉరితీసి గండము గట్టెక్కాలని నిర్ణయించుకున్నారు [] ఆ ప్రకారము సన్యాసి మెడకు దారము కట్టి ఆ దారపు కొనను వురి కొయ్యకు కట్టి , సన్యాసి కాళ్ళ కింద వున్న పీఠాన్ని క్రిందకు తోసివేసి సర్వ సాధారణ రీతిలో ఉరిశిక్ష అమలు జరిపారు [] అందరూ చూస్తూ ఉండగా సన్యాసి వురి కంబానికి వ్రేలాడి కొద్ది క్షణాలలో నే మరణించాడు WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA

====<><><>దారము లోని మర్మము కధ <><>====

WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA

రాణి లక్ష్మణరేఖకు పెద్ద సిగ వున్నది అనగా ముంత కొప్పు అంటారే అది - [] ఆమె వాలుజడ పాదాలను అంటుతూ ఉంటుంది [] లక్ష్మణ రేఖ ఎంతో అలంకరణా ప్రియ కూడాను [] అను వాళ్ళ ప్రతి నిత్యమూ గంపెడు పూలు తెపించుకొని తన జడ పొడుగుకు సరిపడుపొడుగాటి పూల మాలలు అల్లించుకొని తన కొప్పున తురుముకొని అలంకరించుకొంటూ ఉండేది [] ఇంతటి పెద్దపెద్ద పూలమాలలు అల్లి రాణి కొప్పునుండి వ్రేలాడతీసినప్పుడు - పూల భారమువలన దారము నడి మధ్యకు తెగి - రాణి తల నుండి ఆ పూల మాల ముక్కలై నేల పడు అవకాశము కలదుకదా ? అట్లు జరిగిన రాణి కోపించు ను కదా ? అని ముందు జాగ్రత్తలు అతిగా కల కొందరు చెలికత్తెలు అలోచించి , సాలెవాండ్రను పిలిపించి " చూపులకు సున్నితము పనితీరుకు, గట్టి తనమునకు ఇనుపతీగా ? అనిపించు విధముగా ఒక దారపు కండెను చేసి ఇమ్మని అడిగిరి [] వారు అట్లే చేసి ఇచ్చిరి [] రాణి లక్ష్మణ రేఖ తన పూల దండనుండి విడదీసి ఇచ్చినది ఇటువంటి దారమే [] అందువల్ల దారము సున్నితముగా కనపడుచూ ఉండి కూడా ఇనుప తీగ యొక్క పటుత్వముతో సన్యాసి మెడను బిగించి పట్టినది [] ఈ వరకే సన్యాసి మాంసము

అంతయు కృశించి, ఎముకల పోగు , నరాల మూట అయ్యి ఉన్నాడని చెప్పుకున్నాము కదా ? అందువల్ల ఇనుప తీగను పోలిన ఆ పూలలోని దారము - సన్యాసి మెడలోబయటకి తేలిన ఒక జీవ నరమును లోనికి దిగి కోసి ఆ నరమును తెంచి వేసినది [] ఆకారణమున సన్యాసి లో ని , జీవాహంస బయటికి వెడలి పోయి సన్యాసి విగత జీవుడు అయినాడు [] చివరికి సన్యాసి ఆరు నెలలో విచిత్రమైన మరణము పొందినాడు అనుటలో సందేహము లేకుండా పోయినది [] దీని తరువాత రాజులు ఏమియైనారో నన్న విషయము మనకు అప్రస్తుతము - కానీ సన్యాసిని వెన్నంటి వచ్చిన నల్ల కుక్క ఏమయినది అన్న సంగతి మనము తెలుసుకొనవలసియే వున్నది []<><>{}
**WRITTEN BY VARANASI SREE RAMA KRISHNA**
సన్యాసి యొక్క జీవుని ఆత్మ హంస రూపము పొంది రెక్కలు చాచి ఎగురుచూ భూ మండలము దాటి మబ్బులలోనికి ప్రవేశించుసరికి - అక్కడ మొబ్బులపై నల్లకుక్క నిలబడివుంది సన్యాసి ఆకను స్వాగతించినది [] ఇప్పుడు కుక్క మనుష్య భాష కాక కుక్క భాష లోనే మాట్లాడినది [] ఇప్పుడు వున్నా తేడా ఏమిటంటే - కుక్కయొక్క భాష సన్యాసి ఆత్మకు అర్ధము అయ్యి- తిరిగి దానితో దానికి ఆ భాషలోనే సమాధానము ఇవ్వగలిగినాడు []
==<>=<>కుక్క సన్యాసి ని స్వాగతించి నరకమునకు తోడ్కొని పోయిన కథ =<><>=
కుక్క సన్యాసి యొక్క ఆత్మకు దారి చూపుచూ అతన్ని నరక ద్వారము వద్దకు చేర్చింది - ఆపై మాయము అయిపోయింది [] ఎంతో ధర్మాత్ముడైన తనను ఈ కుక్క నరకమునకు ముందు ఎందుకు నిలబెట్టినదా ? అని సన్యాసి విచారించు చుండగా కుక్క తిరిగి ప్రత్యక్షము అయినది [] ఇప్పుడు దానివెనుక పది మంది యమ భటులు మోయుచున్న పెద్ద బంగారు పల్లకీ , దాని ముందు స్వయముగా యమధర్మ రాజుల వారు , ఆయనకు ముందుగా నడచుచు మన నల్ల కుక్కా వచ్చిరి [] యమధర్మ రాజు సన్యాసిని పల్లకీలో కూచుండ పెట్టి స్వర్గమునకు పంపినాడు [] ఇప్పటి వరకూ ఇట్టి సత్కారము ఏ నరమానవునకు - చివరకు ధర్మరాజుల వారికి కూడా జరుగలేదు [] ఇట్టి సత్కారము సన్యాసికి ఎందుకు జరిగినదో ? అన్న సంగతి మీరు ఊహించి చెప్ప వలెనని కోరుచున్నాను [] నేనే చెప్పవలెనన్న" నరకలోక ద్వార పాలకులధర్మ సందేహాలు - కుక్క ప్రత్యుత్తరాలు " అను ఇంకొక కథ రాయవలిసి వచ్చును{} దానిదేమున్నది రాసెదను [] " సన్యాసి భూమికి ఇచ్చిన గౌరవమే దీనికి కారణము అని మొదటగా చెప్పుదును []
====== ఇది రాయుటకు వారము పైగా పట్టినది - ఫేస్బుక్ లోని నా ప్రొఫైల్ లో , ఈ కథను పూర్తిగా పోస్ట్ చేయకముందే పాతిక మంది వరకు చదివి లైకులు /లవ్వులు పెట్టారు [] అదీ సంతోషం ========
కాశీ మజిలీ పోలిన కథ రాయాలని రాసాను - అంత నా స్వంత రచన మరియు కల్పనే []

======================================
చిత్ర కారుడు - చిట్టి రాణీ
ఒనోక రాజ్యములో శంకర్ { చంద మామలోకథలకు రాజూ రాణీల బొమ్మలు వేసి మనను మెప్పించిన ఆయనకు పూర్వ తరపుభందువు , అనుకోని కథను ఆస్వాదిద్దాము} అనే చిత్రకారుడు ఉండేవాడు . అతని వద్ద ఒక చిన్న కుర్రవాడు చిత్ర కళను అభ్యసిస్తూ వున్నాడు []

దేశపు రాజు గారికి ముగ్గురు  భార్యలు వున్నారు [] సహజంగానే మొదటి ఆమెను పెద్ద రాణీ రొండోవ ఆమెను  చిన్న రాణి అని , మూడవ ఆమె ను చిట్టి  రాణీ అని వ్యవహరిస్తూ  వుండే వారు  [] చిత్రకారుడు శంకర్ చిత్రించినవే అయిన,  మొదటి ఇద్దరు  రాణులయొక్క చిత్రపటాలు ఎల్లప్పుడూ రాజుకు కనపడే విధంగా గోడలకు అలంకరించ బడి ఉండేవి [] తన చిత్ర పటము  ఒకటి కూడా అదే విధంగా గోడకు వ్రేలాడుతూ వుండాలని , అది చూసి ఆ చిత్రపతములోవున్నదని నిజమైన రాణి అని  భ్రమించి ' నా రాణి నాకోసం వేచి చూస్తూ వుంటుంది " అనుకోవాలని  చిట్టి రాణి కోరుకున్నది []
చిట్టి రాణికి ఒక పెంపుడు కుక్క వున్నది [] రాణికి  పెళ్లి అయి వస్తూ వస్తూ ఉండగా ఈ కుక్క ఆమెను వెంబడించుకొని వచ్చింది [] దారి మధ్యలో కొందరు బందిపోట్లు చిట్టి రాణీ యొక్క పల్లకీని అడ్డగించగా , కాపలా సైనికులకన్నా ముందుగా ఈ కుక్కయే స్పందించి - దొంగలతో వీరోచితంగా పోరాడి - డొక్కలలో కత్తి పోట్లు తిన్నది - ప్రాణాలు విడిచేది కూడా అయ్యింది []  అప్పడనుండీ కుక్క అంటే చిట్టి రాణీ కివిపరీతమైన ప్రేమ అయ్యింది []
చిట్టి రాణీ ఆ కుక్కను వడిలో కూచో పెట్టుకొని తన అందాన్ని దర్పాన్ని ప్రతిబింబిస్తూ ఒక చిత్రాన్ని చిత్రించి ఇవ్వమని శంకర్ ని అడిగింది [] శంకర్ రాజమందిరాన్ని సందర్శించి చిట్టి రాణీని ఎదురుగా కూచో పెట్టుకొని ఆమెను ఆమె యొక్క కుక్కను సహజ సుందరం గా చిత్రించాడు [] " రాణీ గారు తుది మెరుగులు దిద్ది రేపు మీకు ఈ చిత్రాన్ని సమర్పిస్తాను " అని చెప్పి శంకర్ చిట్టి రాణీ నుండి సెలవు తీసుకొని వెళ్లి తిరిగి మరునాడు వచ్చి చిత్రాన్ని - గోడకు వేలాడదీసి  రాణికి చూపాడు [] రాణి ముక్కు విరిచింది "' చిత్రంబాగానే వున్నది కానీ  గోడ దగ్గర నేనే నుంచుని ఉన్నానా ? అనిపించేభ్రమ కలిగించే విధంగా లేదు []  నీ చిత్రము అందులో వున్నది నేనెను అని భ్రమ కలిగించే విధంగా ఉండి ఉంటే  - నా కుక్క ఆ చిత్రాన్ని చూసి అది నేనెను అని భ్రమ పడిఅటువంక దూకి వుండాల్సింది  -  - కానీ  అది  నా చిత్రం కళ్ళే చూడకుండా ఏటో దిక్కులు చూస్తోంది - నాకుక్కనా చిత్రాన్ని చూసి అది నేనెను అని భ్రమ పడేలా ఉండాలి నీ చిత్ర చాతుర్యము - అప్పుడే నా సహజ సుందర  రూపము చిత్రితము అయినట్లు  -ఆ రకంగా చిత్రాన్ని రుద్దండి " అని ఆజ్ఞ్య ఇచ్చి వెళ్ళిపోయింది []  శంకర్ చిత్రాన్ని మరలా తన చిత్ర శాలకు తీసుకువచ్చి దానికి కొన్ని మార్పులు చేసి - మరునాడు  తీసుకు వెళ్లి ఆ చిత్రాన్ని రాణి ముందు ప్రదర్శించాడు  [] ఈ సారి కుక్క చిట్టి రాణీ నుండి విడిపించుకొని చిత్రం ముందుకు దూకి చిత్రంలోని ఆమె కాళ్ళను ఆప్యాయంగా నాకసాగింది []
సజీవమైన మనుషుల పట్ల కుక్కలు ఆప్యాత కనపరిచే    తీరు ఇదే కదా ? అందువల్ల  - కుక్క తన చిత్రాన్ని చూసి చిత్రము లో వున్నది నిజంగా  తనేను అని భ్రమపడి, తన పాదాలు నాకుతూ వున్నది అని  చిట్టి రాణి అనుకున్నది  [] చిత్రము ఎట్లాగో బాగానే వున్నది [] పైగా కుక్కను కూడా చిత్రము సజీవం గా ఉన్నట్లు సాక్ష్యం పలికింది [] చిత్ర పటము  సహజంగా ఉన్నట్లు రుజువు అయ్యింది కూడాను [] దీనితో చిట్టి రాణీ ఎంతో సంతోషించి తన రత్నాల హారం ఒకటి శంకర్ కి బహుమానం ఇచ్చింది []
శంకర్ దెగ్గర ఒక శిష్యుడు ఉండి చిత్ర కళను అభ్యసిస్తూ వున్నాడు కదా ? శంకర్ వాడిని పిలిచి వాడికొక రత్నం ఇచ్చాడు[] ఇచ్చి  "దీనిని అమ్మి  సంపన్నుడవై - పెళ్లి చేసుకొని - స్థిరపడి సుఖించు " అని దీవించాడు []

" గురువుగారు చిట్టి రాణీ గారిని మెప్పించటం ఎల్లా సాధ్యం అయ్యింది ? అని శిష్యుడు అడిగాడు
అప్పుడు శంకర్ శిష్య వాత్సల్యముతో "నాయనా అన్ని కళలతో పాటు ఎదుటివారి మనస్సులో యేమిఆలోచిస్తూ . ఆ ఆలోచనను ఏ మాటల రూపములో చెపుతూ వున్నారో తెలుసుకోవటం కూడా ఒక గొప్ప కళ [] కుక్క కు ఎవరన్నా నచ్చితే లేదా అది ఎవరినన్నా ఇష్టపడితే అది ఆ సంగతి అది ఎట్లా తెలియచేస్తుందో అనెద్ది ఆలోచించు [] మీద పడి కాళ్ళూ చేతులు నాకటం ద్వారా తెలియ పరుస్తుంది [] రాణీ కూడా ఇదే విధముగా ఆలోచిస్తూ వున్నది " కుక్కకు చిత్రము నచ్చి - అందులో వున్నది నేనెను అని భ్రమ పడితే అది చిత్రము మీద పడి నా పాదాలను నాకాలి కదా అని తర్కించుకొని - ఆతర్కము ప్రకారము నా మొదటి చిత్రాన్ని నిరసించింది []
అందువల్ల నేను ఆమె బొమ్మలో ఆమె కాళ్ళ కింద వున్నాపాద పీఠము మీద తేనెలో బెల్లము ను రంగరించి పూసి, అదొక అందమైన రంగులాగా రాణిని భ్రమింప చేసాను [] కుక్క , తేనే- బెల్లము వాసన పసికట్టి దానికోసామి రాణి వాడినుండి ముందుకు దూకి చిత్రములో ఆమె పాదాలను నాకిది [] దీనితో చిత్రము సజీవ మూర్తి అని భావించియే కుక్క చిత్ర పటాన్ని నాకింది రాణి నమ్మింది [] రొండో సారి నేను ఎదో అద్భుతము చేసి చూపాను అనుకుంటూ నాకు రత్నాల హారము ఇచ్చి నన్ను సత్కరించింది " అని చెప్పాడు [] సమాప్తము []దక్షిణానన్దా మూర్తి గారికి సమర్పణ []
లుకల హస్సన్ 07-07-22
ఒకానొక వూరిలో హస్సన్ అనే ముసలోడు ఉండేవాడు [] చిలకలు గోరోరువంకలు వంటి పెంపుడు పక్షులను అమ్ముతూ వుండే దుకాణాన్ని నిర్వహిస్తూ వుండే వాడు [] జనం అతన్ని చిలుకల హాసన్ అనే వారు [] క్రమంగా తనికి యాభది ఏళ్ళ వయసు వచ్చింది [] " అతను ఒకనాడు " నేనూ నా ముసలిది ఈ దుకాణము మీద వచ్చే ఈ చాలీ చాలని ఆదాయముతో ఎల్లా జీవిస్తాము ?ఎంత కాలము జీవిస్తాము ? మావృద్ధాప్యము సుఖంగా భద్రంగా గడపటం ఎల్లాగా? అని ఆలోచించాడు [] ఆనాటి నుండీ తనకు తెలిసిన వారితోను తన దుకాణం వచ్చిన వారితోను ఇల్లా చెపుతూ వచ్చాడు " నేను త్వరలో రాజుగారిని సందర్శించి అయన చేత నేను చెప్పినపని చేయిస్తాను - అని పందెము - మీరు ఒక వెండి నాణెము పందెము వేయండి [] నేను రాజుగారిచే నేను చెప్పిన పని చేయించకపోతే మీ వెండినాణెము బరువుకు సరిపడా వున్నా ఒక బంగారు నాణెము మీకు ఇస్తాను [] రాజు గారు నేను చెప్పిన పని చేసినప్పుడు మీరు మీ వెండి నాణేన్ని నాకు కోల్పోతారు " అని చెప్పాడు [] ఒక రాజుగారు - ఒక ముసిలివాడుఎందుకూ పనికి రానీ వాడు చెప్పినట్లు చేయటం ఎల్లా సాధ్యము అవుతుంది ? ఏమిటి ? సాధ్యం కాదుకదా? అని అలోచించి న వారు , పందేల రాయుళ్లు - వెండి నాణేనికి బంగారు నాణేని ఆశించి అనేకులు - ముసిలోడితో పందానికి దిగారు [] చివరికి ముసలి వాడి వద్ద యాభై వేలవెండి నాణేలు జమ అయ్యాయి []
ముసలి వాడికి కూడా జనాన్ని మోసం చేసే ఉద్ధేశ్యము ఏమీ లేదు [] ఎంతో నిజాయతీ కల మనిషి కూడాను [] అతని నీతి నిజాయితీ గురించినందువల్లే చాలామంది అతనితో పందెం కాసారు [] ముసలి హాసన్ పెంపుడు పక్షులను అమ్మేవాడు అని చెప్పుకున్నాము కదా ? ఆ దేశపు రాణి గారికి మాటాడే చిలకలు అంటే ప్రాణం [] ఆ కారణంగా రాజు గారు అందాల పక్షులను - మాటలను నేర్చిన చిలకలను ఖరీదు ఎక్కువ పెట్టి అయినా సరే కొని రాణికి బహుమానం చేస్తూ

వుండేవారు.[] దీన్ని మనసులో ఉంచుకొని హాసన్ చిలకల్లోనే శ్రేష్ఠమైన జాతికి చెందిన చిలకను ఒక దాన్ని సేకరించి దానికి చక్కని తర్ఫీదు ఇచ్చి దానికి నాలుగు భాషలు నేర్పాడు [] రాణీగారు నాలుగు భాషలలో పండితురాలు - ఆమెకు తెలుగు కన్నడ తమిళ మలయాళ భాషలు కొట్టిన పిండి [] రాణీగారిని దృష్టిలో పెట్టుకొని హాసన్ చిలుకకు నాలుగు భాషలూ నేర్పి - ఆ చిలకను తీసుకొని రాజుగారిని దర్శించాడు [] " " రాజా తమరు మరియు రాణీగారు చతుర్భాషా పండితులు అని విని నాలుగు భాషలు నేర్చిన చిలుకను మీకు బహుమానం చేయటానికి తెచ్చాను స్వీకరించండి అని కోరాడు []
హాసన్ మాటలకు రాజు " నా, మరియు నా రాణీ యొక్క చేతుర్భాషా పాండిత్యము అట్టడుగు పామర జనం వరకు గుర్తింపు పొందింది కదా ?" అని అలోచించి హాసన్ మాటల పట్ల సంతోషించాడు[] చిలకను స్వీకరించటానికి ఒప్పుకున్నాడు [] హాసన్ నిండు సభలో , చిలకతో నాలుగు భాషల్లోనూ అనేక ప్రశ్నలకు సమాధానాలు చెప్పించి రాజును మెప్పించాడు [] రాజు నూట ఒక్క బంగారు నాణేలు హషన్కి బహూకరించాడు []
అప్పుడు రాజు చిలుకను మాటాడించి పరీక్షించి - తానూ పొందిన చిలుక యొక్క గొప్పతనాన్ని రాణికి చూపి ఆమె మెప్పు పొందాలి అనుకున్నాడు [] ఆయన ఎంత ప్రయత్నించినా చిలుక మాట్లాడింది కాదు [] అప్ప డు హాసన్ ' రాజా మీరు చూసే వుంటారు .చిలక జోస్యం చెప్పే వారు తమ చేతి వేళ్ళు ముడుస్తూ తెరుస్తూ చేసే సంజ్ఞల కారణంగా చిలుకలు తమ విద్య ప్రదర్శిస్తూ ఉంటాయి [] మీరు దయచేసి నేను చెప్పిన విధంగా చేయండి చిలుక పనితనాన్ని ఆస్వాదించండి " అని విన్నవించాడు
ఏమి చేయమంటావో చెప్పు? అని రాజు ఉత్సుకతతో అడిగాడు [] " రాజా కుడి చేతి బొటనివేలుతో కుడిచేతి చూపుడు వేలును తాకండి - అప్పుడు చిలుక తెలుగు మాట్లాడుతుంది - కుడి బొటనవేలును కుడి ఉంగరపు వేలుతో తాకి చూపండి చిలుక మలయాళం మాట్లాడుతుంది , బొటనివేలును మధ్య వేలుతో తాకితే చిలుక తమిళము , బొటనివేలునుచిటికెనవేలుతో తాకితే చిలుక కన్నడము మాట్లాడుతుంది [] ఈ లాంటి చిలుక తమరి దేగ్గరనే తప్ప , భూప్రపంచములో మరొకరి దెగ్గర లేదు అని నేను నిక్కచ్చిగా చెప్పగలను " అని మనవి చేసాడు [] రాజు హాసన్ చెప్పినట్లు చేసాడు [] చిలుక గొప్పగా ప్రదర్శన ఇచ్చి నాలుగు భాషలలో ఎంతో చక్కగా మాట్లాడింది []
పై సంగతి తరువాత చూస్తే. రాజు హస్సన్ చెప్పినట్లు చేసాడని - నిండు సభలో నిరూపితము అయ్యింది [] అందువల్ల హస్సన్ ఎవరికీ బంగారు నాణాలు ఇవ్వవలిసిన పని పడలేదు [] యాభై వేల వెండి నాణేలు అతని సొంతము అయ్యాయి [] హస్సన్ కి దొరికిన నూటొక్క బంగారు నాణేలు, యాభై వేల వెండి నాణేలు - అతనికి అతనిభార్యకు వారి జీవిత కాలమంతా సరి పోవటానికన్నా ఎక్కువఅయినాయి []
కానీ హస్సన్ అదృష్టము చూసి కొందరు వజీరులు దురా లోచన చేసి రాజుతో " రాజా హాసన్ మీ మీద ఒక పందెంకాసి ఇట్లా చేసాడు [] ఒక పందెముగా మిమ్ములను , మీపేరు వాడుకొని సొమ్ము చేసుకున్నాడు " అతడిని శిక్షించండి " అని ఫిర్యాదులు చేశారు
రాజు హస్సన్ ను పిలిపించి 'నీకు గల తెలివి ఆలోచన కృషి పట్టుదల వంటి గుణాలు నా వజీర్ల ద్వారా నా దృష్టికి వచ్చినవి [] నీ చిలుక ఇందుకు ప్రత్యక్ష సాక్ష్యం [] నీ వంటి వ్యక్తి నా వద్ద కొలువులో ఉండటం ప్రజలకు ఎంతో మేలు

చేస్తుంది [] కాబట్టి నేటి నుండీ నువ్వు నెలకు వంద బంగారు దీనరాల జీతముతో నా వద్ద వజీరుగా వుండు " అని చెప్పాడు []
అనుకున్న దానికన్నా ఎక్కువగా హాసన్ పంట పండింది - హాసన్ తన జీవిత కాలమంతా వైభవంగా గడిపాడు []
ఇది వారణాసి శ్రీ రామకృష్ణ అనే నా యొక్క సొంత రచన [] అరేబియన్ నైట్స్ కథను పోలిన లేదా అరేబియన్ఒ నైట్స్ కథా ? ఏమిటి ? అని అనిపించే విధంగా ఒక కొత్త కథను రాయాలని అనిపించి ఇది రాసాను [] సమాప్తము [] తమకు సర్వత్రా అఖండ విజయ ప్రాప్తి రస్తు []

=========================
అమ్మమ్మ గారి పోస్ట్ ఆఫీస్
మా తాత గారు ఒక పల్లె టూరిలోని పోస్ట్ మాస్టారు [] మీకు చిన్నతనం గుర్తుంది - అంటే మీ ఊరి పోస్ట్ మాస్టారు మీకు ఒక భందువులా గుర్తుకు వస్తాడు [] పోస్ట్ ఆఫీస్ కి వెళ్ళినప్పుడు మీరు ఆయనతోను ఆయన మీ తోను ఆప్యాయంగా మాట్లాడుకొని వుంటారు [] [] మీకుటుంబ శుభకార్యాలకు పసుపు పూసిన ఇన్విటేషన్స్ . శుభలేఖలు ఇచ్చి, మీరు పిల్లల గురించి బెంగ బుపడుతున్న రోజుల్లో ,పిల్లలచేతిలో గవర్నమెంట్ ఉద్యోగాల అప్పోయింట్ ఆర్డర్స్ పెట్టిన ఒక స్నేహ పూరితమైన వ్యక్తి గా అయన మీకు ఎంతో ఆపుడు [] సరే నేడు అయన మాయం అయినాడు [] నా చదువులు అయిపోయి వుద్యోగం కోసం నిరీక్షితున్నప్పుడు పోస్ట్ ఆఫీస్ వారే నా భవిష్యత్తుకు వెలుగు అయినా ఒక గవర్నమెంట్ ఉద్యోగపు ఆర్డర్ ను నా చేతిలో పెట్టారు [] ఏడుకొండల వెంకన్నకు మొక్కితే ఆయన పోస్ట్ ఆఫీస్ ద్వారా చేయి బయటికి పెట్టి మన చేతిలో వరాలు పెడతాడని నేను ఇప్పటికీ నమ్ముతాను []
మాతాత గారికి ఏ ఇరవయ్యావయేటనో పోస్ట్ ఆఫీస్ పని దొరికింది . ఆయన దాన్ని ఇంట్లోనుండే నడిపేవాడు [] తన ఫదిహేనవ ఏటనే మా తాతను పెళ్లాడిన మా అమ్మమ్మ ఆయనకు అన్నింటా చేదోడు వాదోడుగా నిలిచి, ఆయన వూరిలో లేనపుడు పోస్ట్ ఆఫీస్పనులు నడిపేది [] మా అమ్మమ్మ గారి - పేరు అన్నపూర్ణమ్మ గారు []గుండ్రాయి పెట్టి కుకుండు కాయను కొట్టినట్లు , పోస్టల్ ముద్రను తీసుకొని పోస్టల్ స్టాంప్ మీద బాదటం ఆమెకు ఇష్టమైన పని [] మిగతావి పోస్ట్ బంట్రోతుగా వున్నా నాగయ్య పంతులు చూసుకునేవాడు []
మా అమ్మమ్మకు సీతారామయ్య గారు అనే అన్న గారు వుండే వారు [] ఆయన స్వతంత్రం రావటానికి ముందు వున్నా బడిలో చరిత్ర మాస్టారు [] అందువల్ల అయన ఇంగ్లాండ్ యొక్క విక్టోరియా రాణి అంటే భయ భక్తులు కలిగి ఆమె గొప్ప తనాన్ని వేనోరులా పొగుడుతో వుండే వాడు [] విక్టోరియా రాణి వూ అంటేనే రైలు నడుస్తుందని , విమానం ఎగురు తుందని , యుద్ధము ఆగుతుందని, ఊరిలోని పోలీస్ ఇన్స్పెక్టర్ ఏమి చేస్తున్నది కూడా విక్టోరియా రాణి కనిపెట్టి ఉంచుతుందని - ఒక నాడు ఒక పోలీసు అయన విక్టోరియా రాణి పటము ముందు నిలువబడి మీసం దువ్వాడని - ఆమరుసటి రోజు విక్టోరియా రాణి పంపిన గవర్నర్ జనరల్ వచ్చి పోలీసు అయన మీసాలు క్షవరం చేయించాడని- విక్టోరియాయా రాణీకి అంతా తెలుసునని అయన తరచూ చెప్పుతుంటాడు []
తన చెల్లెలు పోస్ట్ తో సంభందం కలిగి వుండటము అయన ఎంతో గొప్పగా భావించేవాడు [] పోస్ట్ యొక్క గొప్పతనాన్ని వందరెట్లు చేయటం ద్వారా తన

చెల్లెలి గొప్పతనాన్ని ఫది ఇంతలు చేయటం ఆయన హాబీగా ఉండేది [] పోస్ట్ అంటే ఏమిటి పోస్టల్ స్టాంపులే కదా []
విక్టోరియా రాణి "వూ పంపించండి "అని ఆర్డర్ వేసినందునే , పోస్టల్ స్టాంప్ అంటించిన ఉత్తరాలు కదులుతున్నాయని - వచ్చిన ఉత్తరాన్ని తీసుకోకపోతే , అది రాణికి తెలిసిందంటే ఆమె మనల్ని జైలు పాలు చేస్తుందని అయన అనే వాడు [] రాణీ గారికి ఎంత పలుకు బడి లేకపోతే అర్ధనా స్టాంప్ అంటించిన కార్డు ముక్క ఢిల్లీ దాకా పోతుందో ఆలోచించండి అని నూరిపోసేవాడు [] రాణీగారు ఎంత గొప్ప ఆలోచన పరురాలో చూడండి - ఒకే కార్డుమీద కలెక్టర్ కి రాసుకోవచ్చు గవర్నరుకీ రాసుకోవచ్చు - కావాలంటే పక్కింటి వారికి కూడా రాసుకోవచ్చు . ఎవరూగానీ చివరికి మా హెడ్ మాసాలు గారు కూడా నువట్లా కార్డు ఎందుకు రాసావు అంటానికి వీలులేదు[] అట్లా అంటానికి ఎవరికీ కలేజా చాలదు అనిచెప్పేవాడు [] ఒక్క కానీ పెట్టి ఒక్క స్టాంప్ కొన్నామంటే రాణీ గారు మనకు అండదండలుగా నిలిచినట్లే [ ] అలంటి గొప్ప స్టాంపులు అమ్మే గొప్ప అదృష్టము నా చెల్లికి నా బావకే పట్టింది " అని అయన అందరికీ చెప్పేవాడు
మా అమ్మమ్మ తన అన్న బోధనలు విని స్టాంపుల మీద ఎనలేని గౌరవం పెంచుకుంది [] " ఉత్తరాలు పంచటం కాదు ఆప్యాయత పంచటమే పోస్ట్ మాస్టారు పని "అని ఆమె అనేది- నమ్మేది [] - చదువు రాని యువతుల తరఫున వారి భర్తలకు కార్డులు రాసి ఇచ్చేది . జవాబులు చదివి వినిపించి వారి భావోద్వేగాలతో పాలు పంచుకునేది . మహిళలను ప్రోత్సహించి పోస్ట్ ఆఫీస్ లో రూపాయలు దాచుకునేట్లు చేసి వారి ఆప్యాయత పొందేది [] అప్పుడప్పుడు " మీరు సినిమాలో చేసిన పనిమాకు నచ్చలేదు " అని ఊరి వారిచేత గుమ్మడి గారికి ఉత్తరాలు రాయించేది [] ఊరి పోస్ట్ ఆఫీస్ మూల పడింది - కానీ మూత పడలేదు [] మా తాతయ్య మరణించాక పోస్ట్అఫీసు వేరే వారి పరం అయ్యింది [] కానీ జనం అలవాటు పడ్డ చోటుగదా పోతే పోనిమ్మని ఒక పోస్ట్ బాక్స్ మాత్రం మాతాతయ్య గారి ఇంటిగోడకే వ్రేలాడ దీశారు [] అదే రోజుల్లో రిటైర్ మెంట్ తీసుకున్న పోస్టల్ జవాను నాగన్న పంతులు కూడా మా అమ్మమ్మ పంచనే చేరాడు [] ఇద్దరూ కలిసి ఒక ప్రైవేటు పోస్ట్ ఆఫీస్ లాంటిది నడిపారు [] వూర్లో వున్నా పోస్ట్ ఆఫీసులో స్టాంపులు కవర్లు కొనుక్కురావటం - వాటిని తమ దగ్గర అమ్మటం - ప్రజలు పోస్ట్ బాక్స్ లోవేసిన లేదా చేతికి ఇచ్చిన ఉత్తరాలను కట్టకట్టి తీసుకెళ్లి నిజమైన పోస్ట్ ఆఫీస్ లో ఇవ్వటం - అదీ వీళ్ళ పని [] మా అమ్మమ్మకు మా తాత నుండీ పద్నాలుగు ఎకరాల పొలం దక్కింది [] దాని మీదవచ్చే ఆదాయంతో ఆమె పోస్టల్ ఖర్చులు నెట్టుకుంటూ వచ్చి నాగన్నకు ఇంత అని జీతం ఇచ్చింది []
మా అమ్మమ్మ హయాములో పోస్ట్ ఆఫీస్ ఉండగా నాకు కొన్ని తీయని అనుభవాలు వున్నాయి - అవి కూడా చెప్పకోకపోతే మనస్తుప్తి ఉండదు
మా ఇంటికి ఎదురుగానే ఒకరి ఇల్లు ఉండేది [] అందులో ఒక పిల్ల ఉండేది [] అది నాకు ఏమివరుసలో ఉందో నాకు ఎవరూ చెప్పలేదు [] ఒక రోజుని నేను పంచదార సిగిరెట్ పీలుస్తూ పెద్దవాళ్లలా ఫోజులు ఇస్తున్నాను [] ఆ పిల్ల చూసింది [] వెళ్లి వాళ్ళ తాత తో " బావ సిగిరెట్లు కాలుస్తున్నాడు - కిందనుండీ పైనుండీ పొగలు వదులుతున్నాడు " అని ఫిర్యాదు చెప్పింది [] నావీపు పగిలింది [] ఆ పిల్ల తాత బీడీలు పీల్చి ఆ పొగను ముక్కునుండి చెవులనుండీ వెలువరించటంలో నిష్ణాతుడు [] అయన ఎదో అలోచించి, వాడు కిందనుండి కూడా పొగలు వదిలాడు అంటే వాడు నా కన్నా ఘటికుడు , ఉద్దండుడు అని సంతోషించి "

ఉద్దండ పిండము అయినా మీ కుమారుని నా మనుమరాలికి ఇచ్చి వివాహం జరిపినచో మీకుమారునికి మూడు ఎకరాల శ్రేష్ఠమైన పొగాకు పండే పొలాన్ని కట్నంగా ఇస్తాను - చిత్త గించవలెను " అని ఒక పోస్టు కార్డు మీద రాసి మా నాన్నకి పడేసాడు []అప్పటి నుండీ ఆ పిల్ల నా మరదలు మరియూ కాబోయే పెళ్ళాము అయ్యింది [] మా పెళ్లి జరిగినప్పుడు ఈ పొలం కట్నంగా ఇవ్వటానికి వాళ్ళు ఒప్పుకోలేదు [] కోర్టులో కేసు నడిచి నపుడు ఈ పోస్టు కార్డు ముసలాయన రాసిన వీలు నామా లాగ పనిచేసి పొలం నాకు దక్కింది [] రియల్ ఎస్టేట్ వాళ్లకి దాన్ని ఎకరా మూడు కోట్లకు అమ్మాను []
పైన చెప్పిన పిల్లకు పేరు లక్ష్మీ సుబ్బమ్మ - కి జ్ఞ్యానోదయం చేయాలనీ అలోచించి - ఒక పోస్టల్ కవరు మా అమ్మమ్మ దగ్గర అప్పుతీసుకొని , దానిలో ఒక పంచదార సిగిరెట్ మరియు నాలుగు పున్నాగ పూలు  పెట్టి " పోస్ట్ ఆఫీస్ ఎదురింటి వారికి " అని రాసి మా అమ్మమ్మకు ఇచ్చాను [] కవరు డెలివరీ అయ్యి నేటికీ ఆ పిల్ల పెట్టెలో తీపి జ్ఞపకాల దొంతరల్లో వున్నది [] పంచదార సిగిరెట్ రుచి చూసి నిలకడ మీద నిజం తెలుసుకుని నా మీద మనసు పారేసుకున్నాను అని  లక్ష్మీ సుబ్బమ్మ ఇప్పటికి ఎన్నో మారులు అన్నది []
ఒకేసారి ఒక రైతు పడతి మా అమ్మమ్మ దెగ్గరికి వచ్చింది " పెద్దమ్మా నాకు ఆరో నెల .  ఒప లేకుండా వున్నాను - పురిటి కానీ నన్ను పుట్టింటికి ఆపమంటే నా మొగుడు ఇంటం  లేదు . కొడుక్కి నచ్చచెప్పి నన్ను పుట్టింట్లో దింపమని నా అత్తా పేరున ఒక కార్డు రాయండి . నా అత్తా నేను ఒక ఇంట్లోనే వున్నా ఇద్దరికీ మాటలు లేవు." అని చెప్పింది [] " అల్లాగే రాద్దాము
పోస్ట్ కార్డును పోస్ట్ ముద్రను కాదంటానికి వాళ్ళకి ఎన్ని దమ్ములుండాలి " అని మా అమ్మమ్మ ఆ పిల్లతో చెప్పి,   పోస్ట్ కార్డు రాసి పంపింది []అత్త కూడా  కోడలు పడుతున్న పాట్లను చూస్తూనే వుంది [] పోస్టల్ కార్డు రావటం తోటే ఆమె మనసు కరిగింది ఇంకా ఆగలేక పోయింది [] పిల్లాడికి నచ్చ చెప్పుకుంది [] తన మొగుడిచేత ఎడ్లబండి కట్టించి అందులో ని జల్ల లో  మెత్తని పరుపులు పరిచి కోడలిని అందులోకి ఎక్కించి అందులో నే తానూ కూచొని కోడలిని పుట్టింటిలోదింపి వచ్చింది   [] ఆపిల్ల మొగుడు అడ్డదారిలో వచ్చి ఎడ్లబండిని వెంబడించి - పిల్ల కూచున్న పరుపుల మీద పొలంలో తెంపుకువచ్చిన బంతిపూలు కుమ్మరించి భార్యను మంచి చేసుకున్నాడు [] ఇయిందంతా విన్న మా అమ్మమ్మ " పోస్ట్ ఆఫీస్ కు వున్న గౌరవ మర్యాదలు ఇట్లాగే ఉంటాయి - అని అందరికీ చెప్పుకొని మురిసి పోయింది []
ఒకనాడు ఒకరైతు వచ్చి " మా కుర్రవాడు ఎంత చెప్పినా గానీ ఇంతలేదు  - ఈపురుగుల మందు మిరప చేలో చల్ల రా అంటే సల్లటం లేదు  [] ఈ డబ్బాను వాడికి పంపి పొలంలో కొట్టమని కార్డు రాయండి  [] మీరు  చెప్పాబు అంటే వాడు తప్పక వింటాడు " అన్నాడు [] అప్పుడు మాఅమ్మమ్మ  ఒక కాగితం మీద ఒక స్టాంపు అంటించి ఆ సంపూ మీద ముద్రకొట్టి ఆ కాగితాన్ని డబ్బామీద అంటించి ' తూరుపు డొంక పొలం "అని అడ్రెస్స్ రాసి నాగన్న పంతులికి ఇచ్చి పొలం లో డెలివరీ ఇప్పించింది [] దీనికి కృతజ్ఞతా అన్నట్లు ఆ రైతు మరియు అతని కొడుకు కలిసి ఒక అరబస్తా పండుమిర్చీలు తెచ్చి పచ్చడి పెట్టుకోమని మా అమ్మమ్మకు ఇచ్చారు [] సుద్ధ పప్పులో ఆ పండుమిర్చి కారం పచ్చడి మిళాయించి తిని నేను అనేక సార్లు స్వర్గం చూసి వచ్చాను []
అన్ని వైభోగాలకు ఏనాడో ఒకనాడు అంతము రాకపోదు [] కానీ మా అమ్మమ్మ పోస్ట్ ఆఫీసుకి అలాంటి అంతము ఏదీ రాలేదు [] మా అమ్మమ్మ ముసలిది

అయినా విధంగానే ఆమె స్నేహితులు , పరిచయస్తులూ ముసలి వారు అయినారు [] " ఇవాళ సుబ్బమ్మ లెగవలేదంట - ఈ కూర గిన్నె దానికి పంపండి " అని ఒకామె ఒక గిన్నెను తెచ్చి మా అమ్మమ్మకి ఇచ్చింది [] పోస్టల్ వారు దేన్నీ కాదంటానికి వీలు లేదుకదా? అని మా అమ్మమ్మ ఒక ఐదు పైసలు స్టాంప్ ఆమెకి అమ్మి ఆ స్టాంపుని కూరగిన్నె మీద అంటించి - నాగన్న చేత డెలివర్ ఇప్పించింది [] ఇటు తరువాత మా అమ్మమ్మ వ్యూహం మార్చుకొని - తానే తన సొమ్ములోనుండే ఇంత అని ఖర్చు పెట్టి , అన్నము కూరలు వంటివి వండించి గిన్నెలలో పెట్టించివాటి మీద స్టాంపులు అంటించి - వృద్ధులకు వండుకోలేని వారికి నాగయ్య పంతులు చే పోస్టల్ డెలివరీ చేయించింది [] చివరి చివరికి ఆ వూరు అసలు పోస్టఅ ఆఫీసునుఉనికిని మరిచి " అన్న పూర్ణమ్మ గారి పోస్ట్యే ఆఫీస్ " అంటూ మా అమ్మమ్మ నడిపిన ప్రైవేట్ పోస్ట్ ఆఫీస్ నే గుర్తు పెట్టుకున్నారు [] నేటికి ఆమె కూడా మాయం అయింది [] పోస్ట్ ఆఫీస్ అన్న పూర్ణమ్మ గారి మనుమడిని అని నేను వూరిలో గొప్పగా చెప్పుకుంటూ వుంటాను [] నీవుటారా ? బంగారు తండ్రీ అని వారు నన్ను గుర్తిస్తూ వుంటారు [] పోస్ట్ ఆఫీస్ అనేది ఉత్తరాలు కాదు ప్రేమలు పంచుతుంది అని ప్రపంచములోని ఎందరో ఒప్పుకున్నారు[] ఇంకేమీ లేదు ముగిసింది {]

వంద షేవ్ ల బ్లెడు

సంపన్న మూర్తి నిద్రలేస్తూనే " దేవాది దేవా ఈ రోజు నా పైసా ఆదా అయ్యేటట్లు అనుగ్రహించు " అని మొక్కి నిద్రలేస్తాడు . ఇక్కడ పైసా అంటే పైసలు అనికాదు , డబ్బులు అని మీకు తెలిసేవుంటుంది .[] ఒక పైసా ఆదా చేసుకోవటం అంటే ఒక పైసా సంపాదింహటంతో సమానమని ఇంగిలీషు సామెత వున్నది [] ఇక్కడకూడా పైసా అంటే పైసా కాదు పైసా అంటే ఒక పౌండ్ అని [] మన సంపన్న మూర్తి - పైసలకోసం అని దేముడిని ప్రార్థించే తెలివి తక్కువ వాడు కూడా ఏమీ కాదు [] అందువల్ల అయన పైసా రూపాయలు ఆదా గా చూపించమని దేముని అడిగాడు అని .

ఒక సారి సంపన్న మూర్తి వంద రూపాయలు జేబులో వేసుకొని వెళ్లి , ప్లేటుకి నాలుగు ఇడ్లీ ఇచ్చి ఇరవై రూపాయలు తీసుకొనే చౌక దుకాణం దెగ్గరికి వెళ్లి రొండు ఇడ్లీ ఆర్డర్ ఇచ్చాడు [] షాప్ వాడు అలవాటులో పొరపాటుగా నాలుగు ఇడ్లీ ప్లేటులో పెట్టి దానిమీద చెట్నీ వేసి ఇచ్చాడు [] ఆ తరువాత సంపన్న మూర్తితో " నాదే పొరపాటు మీరు రొండు ఇడ్లీలు నాలుగు తిని ఫది ఇవ్వండి ఏమైపోతుంది " అన్నాడు [] మూర్తి వంద ఇచ్చాడు [] షాపు వాడు ఎదో పొరపాటు పది తిరిగి నూట ఫది రూపాయలు చిల్లర చేతిలో పెట్టాడు []

మూర్తికి ఇరవై రూపాయల ఇడ్లీ ముఫ్ఫా గా దొరికి ఫది రూపాయలు అదనంగా దక్షిణగా దొరికింది [] మూర్తికి ఆరోజు ముప్పై రూపాయలు అదనంగా సంపాదించి నట్లు అయ్యింది []

రోజులు అంటే ఈలాగున గడవాలి , దేముడు నన్ను ఈ రకంగా బ్రోచాలి - అని సుసంపన్నం బాబు అనుకున్నాడు []

ఒకనాడు సంపన్న ఒక షాప్ కి వెళ్లి ఒక బ్లెడ్స్ పాకెట్ కొనుక్కున్నాడు [] దాన్ని కొని కళ్ళకు అద్దుకొని " స్వామీ నా పైసా ఆదా అయ్యేట్లు చూడు అని దేముని అడిగాడు [] ప్యాకెట్ మీద ఏమీ ఆఫర్ లేక పోయినా , షాప్ వాళ్ళు ఐదు బ్లెడ్స్ =

ఫది రూపాయల విసిలువ గల ఆ ప్యాక్ మీదఒక రూపాయ తగ్గింపు ఇచ్చారు []సంపన్న ఈ బ్లేడ్స్ వాడటం మొదలెట్టాడు [] ఒక బ్లెడు తో ఫది రోజుల షేవింగ్ అయితే చాలు రోజుకు రూపాయ బదులు తొంబది పైసల ఖర్చుతో రోజు వెళ్ళు దీసినట్లు అవుతుంది అని అనుకున్నాడు [] అదేమిటో గానీ దీని తస్సా దియ్య బ్లేడ్ ఫది షేవింగ్ లు దాటి దాటి వరుసగా వంద షేవింగ్స్న్న ఇచ్చింది [] సంపన్న బాబు స్నేహితుడు కుమార్ - పళ్ళ ఈ సంగతి తెల్సుకొని ' ఈ సంగతి ఈ బ్లెడు తయారు చేసిన కంపెనీ వారికి తెలుపు [] వారు ఈ బ్లెడు ఇల్లా ఎందుకు తయారయ్యింది ? అన్న సంగతి తెలుసుకొని , మరింత నాణ్యమైన బ్లేడ్స్ తయారు చేయటానికి అని నీ బ్లెడు ను వాళ్ళకి ఇమ్మని అడుగుతారు [] వాళ్ళ రెసెర్చ్క వ్యాపారానికి అది ఎంతో అవసరం అవుతుంది - అప్పుడు నీవు బెట్టు చేసి డిమాండ్ చేసి ఆ బ్లెడు ను లక్ష రూపాయల కి కంపెనీ వారికి ఇచ్చి వేయి " లక్ష అంటే కంపెనీ వారికీ ఏమి లెక్క ఉండదు అని సలహా చెప్పాడు [] మొత్తానికి కంపెనీ వారికి మెయిల్ పెట్టారు [] వారు వచ్చి సంపన్న చెప్పిన మాటలలోని నిజాయితీని నమ్మి - వంద షేవ్ లు ఇచ్చిన ఆబ్లెడు ను లక్షకు కొనటానికి ఒప్పుకున్నారు [] డబ్బులు కూడా బయటికి తీశారు [] కానీ సంపన్న బ్లెడు ధర ఐదు లక్షలు అన్నాడు [] దానితో కంపెనీ వారు చెర్చించుకొని " అల్లాగే - అగ్రిమెంట్ చేసుకుందాము - ముందు బ్లెడు ను లాబులో పరిశీలించి అది నిజంగా వంద షేవ్ లు చేసింది అని నిర్ధారణ జరిగినాక మీకు ఐదు లక్షలు ఇస్తాము " అని చెప్పి బ్లెడు ని పట్టుకు పోయారు []
లాబులో పరీక్షించినాక బ్లెడు నిజంగానే వంద షేవ్ లకు పని చేసిందని స శాస్త్రీయంగా నిర్ధారించారు [] బ్లెడు లో ఏ లోహాల మిశ్రమం జరిగినందున ఇల్లా జరిగిందో కూడా కనిపెట్టారు [] కంపనీ వారు బాగా అలోచించి ఇల్లాంటి బ్లెడు లు తయారు చేస్తే మన కొంప కొల్లేరే అని అలోచించి - ఆ రకం బ్లెడు తయారీని ఆపుకున్నారు []
చివరకి కంపనీ వారినుండి ఒక కొరియర్ ద్వారా మూర్తికి తన బ్లెడు మరి యు ఒక లేఖ అందింది . ఆ లేఖలో ఏమని రాసివున్నదంటే " మీ బ్లెడు వంద షేవ్ లు తెగిన మాట నిజమైనా కానీ - ఎందువల్ల ఆ బ్లెడు అలా పని చేసింది అన్నది తెలియ లేదు .ఇదంతా ఎదో దేముని దయవల్ల { బై -ఆక్ట్ అఫ్ గాడ్ } జరిగినట్లు ప్రతి పరిశోధనలో అభిప్రాయం వెల్లడి అయ్యింది [] మీ బ్లెడు ఒక సాధారణమైన బ్లెడు మాత్రమే అని నిర్ధారణ అయ్యింది [] దీని వల్ల మాకేమి ఉపయోగం లేదు []మీరే గుర్తుగా దాచుకోండి [] అగ్రీ మెంట్ రద్దు అయ్యింది {] అని తెలిపారు సంపన్న మూర్తికి ఒక బ్లెడు పైసాలు ఆదాచేసి ఎంత మిగిల్చిందో చూడండి [] దేముడు సంపన్న మూర్తి కోర్కెలను ఆలకిస్తూ వున్నాడని తెలుస్తుంది [] సంపన్న మూర్తి ఆదా =
బ్లెడు తొంబై పైసలు ఫది రోజులబ్లెడు ఇంకా అదనంగా తొంబది రోజులు వచ్చింది , అనగా తొంబది రోజుల పాటు బ్లెడు ఫ్రీగా వచ్చింది అనుకుంటే 90 X 90 = 8100 పైసలు అనగా 81 రూపాయలు [] దేముడి దృష్టిలో కూడా పైసలు అంటే పైసలు కాదు రూపాయలే [] తన లోపమేమి లేకుండాచూసుకున్నాడు [] దేముని లీలలు ఇలాగే వంటాయని నవ్వుకుందాము. సరేనా ?

వివాహ సంభంద విచిత్రాలు - ]] ఆమె మంచి దానికి మల్లె మళ్లీ పోయింది[[
నా పేరు మరమరాల స్వామి . ట్రాన్స్ఫర్ మీద ఈ వూరు ఆఫీసుకు వచ్చాను [] ఇక్కడ వందమందికి పైగా స్టాఫ్ వున్నారు [] రెండు రోజులు పోనిచ్చి నేను నా

మేనల్లుడు కోదండం యొక్క మ్యారేజ్ ప్రొఫైల్ తీసుకెళ్లి స్టాఫ్ లోని ప్రతి ఒక్కరికీ ఇచ్చి " మా వాడికి ఏదన్న సంభందం ఉంటే చెప్పండి " అని విన్నవించాను [] ఆ సాయంత్రమే మా స్టాఫ్ లో ఒకరైన సుభద్ర గారు అనబడే ఆవిడ నా దగ్గరికి వచ్చి " మా అమ్మాయి వున్నదండి - మీరు వచ్చి చూడ వచ్చు " అన్నది .[] ఆమీ అటుపొంగానే మాకొలీగ్ శివ శంభులింగం వచ్చి " ఆమెతో జాగర్త అండి . ఆమె మనుషులను మనుషులుగా చూడదు. ఆకాశం లో నిలబడి మాట్లాడుతుంది [] అందరినీ చిన్న బుచ్చుతూ హేళన చేస్తూ ఎప్పుడూ తన గొప్ప ప్రకటించుకుంటుంది [] ఇంతకు ముందు ఆమె పిల్ల సంభందం కోసం వెళ్ళినవారు తట్టెడుఅవమానాలు తిని తల దించుకు వచ్చారు [] ఎదుటి వారిని హేళన చేసి సరదా పొందేందుకు ఆమె తన పిల్ల సంభందాన్ని ఎర్రగా చూపించి ఇలా పిలుస్తూ వుంటాది - మీకు కొత్త జాగ్రత్త కోసం చెపుతున్నాను " అని నాకు సూచన ఇచ్చాడు

మా మేనల్లుడు కోందండము గాడి నాన్న గారైన మా బావ చంద్ర సింహం గారు నేను కలిసి సుభద్ర గారి అమ్మాయి ని చూడటానికి అని- ఒక ఆదివారం వెళ్ళాము []
గేట్ తీసిన సుభద్ర గారిని చూసి మా చంద్ర సింహం బావ జంకి పోయాడు ఆయన చేతులు వణికాయి ఖర్చీఫ్తో నుదుట పట్టిన చెమట తుడుచుకొని ,నా చేయి పట్టుకొని వెనక్కి లాగాడు - వెనక్కి పోయి బ్రతికి పోదాం పదరా అన్నట్లు [] సింహం నిజంగా భయ పడ్డాడని తోచింది [] సుభద్ర గారు ఎంతో ఆదరంతో మమ్మల్ని స్వాగతించి , మమ్మల్ని కూచో బెట్టి అమ్మాయికి చెప్పి వస్తాను అని లోపలి వెళ్ళింది []
ఆ సందు చూసి మాబావ నా చెవిలో గుసగుస పోయాడు- దాని ప్రకారం ఏమిటంటే - ఇదివరకు ఒకసారి మా బావ ఇంకొకరి కోసం అని ఇంకొకరితో కలిసి పెద్దమనిషి తరహాలో వీరి అమ్మాయిని చూడ వచ్చారు [] అప్పుడు వీరు వేరేచోట వేరే ఇంట్లో ఉండేవారు [] అందువల్ల ఇప్పడు వున్నాఈ అడ్రస్ ని బట్టి - మేము ఎవరి ఇంటికి వెడుతున్నామో ముందుగా గ్రహించాలేకా ఇలా వచ్చి ఇరుక్కు పోయానన్నాడు [] అప్పుడు ఇదే సుభద్ర గారు ధుమధుమలాడుతూ " అమ్మాయి పెళ్లి కి వుంది అని తెలియగానే ఆస్తి పాస్తులూ , ప్రాపెర్టీలు పొలాలు , కార్లు బంగళాలు లేని ప్రతి అడ్డమైన వాళ్ళు మా గడపతొక్కుతున్నారు [] అందుకని ముందు మీ ఆస్తి పాస్తులు ఉద్యోగాలు వ్యాపారాల వివరాలు చెప్పండి [] అవి నచ్చితే నే పిల్లని చూపిస్తాము " అన్నది [] అప్పుడు మాబావ కూడా అవమానము తో వెనక్కి మల్లడు [] మళ్ళా అదే పిల్ల కోసము అదే తల్లి దగ్గరికి వచ్చానని తెలిసి మా ఛంద్ర్ధ సింహం బావ దగ్గు తున్నాడు [] పులి గుహలోకి దూరిన మేకలాగా జంకుతున్నాడు . ఆమె ఏమంటుందో - ఏమి వినాల్సి వస్తుందో - ఏమి పడాల్సి వస్తుందో అని నేను కూడా కంగారు పడసాగాను []కానీ సుభద్ర గారు వచ్చి ఎంతో వినమ్రంగా మా బావకు నమస్కరించి కాఫీలు ఇచ్చి - మధుర మైన కుశల సంభాషణలు జరిపింది [] ఈమె పద్ధతి మా బావ చెప్పినట్లుగా ఏమీ లేదు - ఇదంతా నా ప్రభావమేమో అని నేను అనుకున్నాను [] ఆమె కప్పులు తీసుకొని లోపలి పోగానే "పులి మేకగా మారినట్లు, దయ్యం మనిషిగా మారినట్లు - ఈమె మారిపోయింది రా -నన్ను నమ్ము " అని మాబావ నాతో అన్నాడు []
నేను వున్నాను బావా ఫికర్ పడకు అని నేను ఆయనకు ధైర్యం చెప్పాను []

సుభద్ర గారు మళ్ళీ వచ్చి - ఎంతో వినయంగా - ఈనాటివారు ఎవరైనా సరే ఆశర్య పడే విధంగా పిల్ల గుణగణాలను చనువును ఉద్యోగాన్ని వివరించి చెప్పి - మమ్మల్ని ప్రోత్సహిస్తూ మాటాడింది [] ఆడ పిల్ల తరుపు వారు అందునా పిల్ల తల్లి లో ఇంత సానుకూలత లేదా అనుకువగా మాట్లాడటం , మొగపిల్ల వారి పట్ల గౌరవ మర్యాదలు వినయం చూపించటం వంటివి చూసాక ఇది , ఎదో నేటి కాలానికి విరుద్ధం గా జరుగుతున్నది , ఇదేదో గిన్నెస్ బుక్కు రికార్డు బ్రేక్ వ్యవహారంలో లేదా సృష్టికి సంభవిస్తున్న ఎదో గొప్ప విపత్తునో సూచిస్తున్నది అని నాకు తోచింది []

సుభద్ర గారు నాతో " ఏమండీ మరామరాల స్వామిగారు -మన ఆఫీస్ వాళ్ళు ఈ పాటికి మీతో అనే వుంటారు [] అన్నీ మీకు తెలిసే వచ్చి వుంటారు [] అమ్మాయికి రెండో పెళ్లి [] మొదటి పెళ్లి అయ్యి మూడు నెలలే అయ్యింది [] విడాకులు రాయించాము "అని ఒక బాంబు వేసింది [] ఇట్లా అని ఆఫీసులో నాతో ఎవరూ అనలేదు [] కానీ వాళ్ళ అమ్మాయికి జరిగిన పెళ్లి ఫెయిల్ అయ్యిందని ఆఫీసులో అందరికీ తెలియిపోయి ఉంటుందని - ఆఫీస్ లో ఒకరికి ఒకరు చెప్పుకుంటూ ఉంటారని - ఆమే చెప్పక ముందే ఈ విషయం నాకు తెలిసి ఉంటుందని ఆమె ఆలోచన [] కానీ ఈవిషయం ఇంతవరకూ ఆఫీసులో తెలిసినట్లు నాకు కనపడలేదు []

నేను ఏమీ బయటపడకుండా " మొదటి వివాహం ఎందుకు ఫెయిల్ అయ్యిందండీ - ఇప్పుడు అంతా క్లియర్ యేనా ? అని అడిగాను సానుభూతి చూపిస్తూ .- మాకు సంగతి అంతా తెలిసి వచ్చాము అని ధ్వనిస్తూ -

" బోలెడు ఆస్తి , కార్లూ బంగ్లాలు , చూపించి - వాడిని అబ్బాయి అని చెప్పి మాకు అంటకట్టారు - కానీ వాడు అబ్బాయి కాదు కొజ్జా గాడని మొదటి రాత్రే తెలిసింది - అని కన్నీరు పెట్టుకుంది " "విన్నారుగా ?అమ్మాయికి మొదటి రాత్రి కానీ కాలేదు- ఇంకా మొదటి పెళ్లి లాంటిదే [] మరి మీరు ఏమనుకుంటున్నారో చెప్పండి [] మీరు అంతా తెలిసీ వచ్చారని ఎంతో ఆశతో వున్నాను " అని కన్నీరు ఒత్తుకుంది [] ఈ రోజుల్లో ఎవరూ కూడా మా పిల్లని చూసి ఏమనుకుంటున్నారు చెప్పండి అని అడగటం ఎంతో అరుదు [] సుభద్ర గారు అరుదైన ఆ ఫీట్ ని కూడా చేసింది [] ఓట్లు అడగటానికి వచ్చిన ఓడిపోయినా యంపీ లా దీనంగా వుంది ఆమె మొఖం . ఈమె ఇంత మంచి దానిగా మాట్లాడటానికి ముందు మా బావ చెప్పినట్లు గానే చాలా భయం గొల్పే మరియు అవమానకరమైన మాటల తూటాలు పేల్చిన మనిషి అయ్యే ఉండడానికి సందేహం లేదని నాకు నమ్మకం కలిగింది [] నేను సందోర్భచితంగా మాటాడి " మీ ఆస్తి పాస్తుల వివరాలు రేపు నాకు ఆఫీసులో ఇవ్వండి - లాభసాటిగా ఉందంటే ఆలోచిద్దాము " అని ఆమెకు చెప్పి బయటపడ్డాము []

" మొత్తానికి ఆమెకు మెత్తని చెప్పుదెబ్బ వేశావు" అని మా సింహం నన్ను మెచ్చుకొన్నది [] []ఘంటసాల గారు పాడిన " అత్తా లేని కోడలు ఉత్తము రాలో ఓ యమ్మ " అన్న సాంగులోని కోడలు " నా అత్తను తేలుకుట్టినాక -ఆమె మంచిదాని లాగా మల్లి పోయింది " అని పాడుతుంది - అదీ నాకు అది గుర్తుకు వచ్చింది -

సుభద్ర గారిని, విధి ఆడిన వింత నాటకం లోని తేళ్లు కుట్టాయి - అందుకని ఆమె మంచిదానిలాగా మారి పోయింది [] ఎంత మంచిగా మారిపోయిందంటే సిగ్గువిడిచి " మా పిల్ల ఇంకా మొదటి పెళ్లి పిల్లతో సమానం " అని వివరించి చెప్పుకునేంతగా [] సమాప్తము []

ఇది ఒక నిజ అనుభవము[] సంఘటన యధాతధం - సంభాషణలు కూడా యదా తధం అవునో కాదో మీరే చెప్పాలి []
==============================
మర్రి చెట్టు కింద పెద్ద మనుష్యులు
పెద్దలందరూ కలిసి ఇద్దరికీ అట్టహాసంగా పెళ్లి చేశారు [] అబ్బాయి , అమ్మాయి ఎదురు చూశిన విధంగా సినిమా పక్కీలో ఇద్దరినీ ఒక గదిలోకి పంపి తలుపులు వేశారు [] అమ్మాయి యో అబ్బాయియో ఎవరో ఒకరు లోపలినుండి గడియ వేసుకున్నారు [] పెద్దలు పక్కకి తప్పుకున్నారు [] కాసేపటికి లోపలినుండి గడియ తీసుకొని అమ్మాయి బయటికి వచ్చింది [] ఇందుకోసమే ఎదురు చూస్తున్నట్లు , అమ్మాయి తరఫు పెద్దలందరూ మళ్ళీ గది ముందుకి వచ్చారు [] ఎదో ఫెయిల్ అయ్యింది అని ప్రతి ఒక్కరూ అనుకున్నారు {} అమ్మాయి తన చేతిలోని నిండు పాలగ్లాసు కనపడిన వారి చేతిలో పెట్టి ఏమన్నా దంటే " ఆ అబ్బాయి " ఉత్సాహంతో వచ్చి మళ్ళా కౌగిలించుకుంటాను "అనిచెప్పి వెనక్కి పోయాడు - అందుకని నేను బయటికి వచ్చాను " అన్నది []
దీన్ని గురించి పెద్ద చేర్చ చెలరేగింది - దీని అర్ధం ఏమిటా ?అని
" మొదటి చూపులోనే అమ్మాయి అబ్బాయికి ఉత్సాహం తెప్పించలేకపోయింది - లేదా అబ్బాయ్ మరొక అవకాశం కోరుకున్నాడు - అమ్మాయికాస్త ఓర్పుతో అబ్బాయి మళ్ళా వచ్చే దాకా వేచి చూసి ఉండాల్సింది . అతడికి మరో అవకాశం ఇస్తే ఎంపోయేది ?"అతడు మళ్ళా రావటానికి ఎంత సేపు పడుతుందేమిటి? " మంచం దెగ్గరనుండీ డోర్ దెగ్గరికి ఫది అడుగులు గూడ ఉండదు " అని ఒక ముసలాయన అన్నాడు
" మొదటి చూపులోనే వూపులోనో ఉత్సాహం తెచ్చుకొని వాడు మళ్ళా మళ్ళా వచ్చి ఏమి చేస్తాడు ? ఇదేమన్నా సినిమా షూటింగా రియల్ లైఫ్ అండి" అని ఇంకో ఆయన పిల్ల తరఫున అన్నాడు
" పిల్ల మొగుడిని పట్టుకొని -ఆయన అనకుండా - ఆ అబ్బాయి అనటంలోనే తిరకాసువుంది . అమ్మాయి కి భర్త అంటే లక్ష్యం లేదుగౌరవం లేదు అని తెలుస్తోంది [] తనంటే లక్ష్యం లేని గౌరవం లేని భార్య పట్ల అబ్బాయిలకి ఉత్సాహం కలగక పోవటం సహజం " పిల్ల మనః పూర్వకంగా అతడిని తన వాడిని చేసుకోలేక పోయింది " అని అక్కడే వున్నా డాక్టర్ మనసు - అనురాగం గారు అన్నారు
" నిండు పాల గ్లాసును చూస్తేనే తెలుస్తున్నది -ఆ అబ్బాయి దగ్గర ఉత్సాహం ఎంతుందో ? ఉప్పులేదని తెలిసినాక పప్పు తినలేము ఇంకో మాట అనవసరం " అని పిల్ల తల్లి అన్నది
మీరు కూడా వాళ్ళల్లో వున్నవారే గదా ? మీరు చెప్పండి ?అబ్బాయికి మరో సారి ఉత్సాహం తెచ్చుకునే అవకాశం ఇచ్చివుంటే మంచిది అయ్యేదా ? లేదా ? పోనీ అమ్మాయియే కొంచం తగ్గి " అబ్బా వున్నా ఉత్సాహం చాలులెండి " అని మురిపాలు ఒలికించితే గ్లాసు పాలు ఖర్చు అయ్యేవి కాదా ? అమ్మాయి అంత వేగిర పడి బయటికి రావటం మంచిదేనా ?
ఇలాంటి విషయాల గురించి మీరు ఆలోచిస్తూ వున్నా కొద్దీ మీ అభిప్రాయాలూ ఆలోచనలూ మర్రి చెట్టు కొమ్మల్లా విస్తరిస్తూనే ఉంటాయి [] మీ అభిప్రాయలు ఊహలూ విస్తరిస్తూ ఉండి ఉంటే కనుక ఈ అభిప్రాయాల అనే మర్రి కొమ్మల క్రింద ద కూచున్న పెద్ద మనుషులు మీరే [] మీరేమీ తీర్పు చెప్పక పోతే వాళ్ళు కోర్టుకు వెడతారుట .

మనం ఇంత మంది పెద్ద మనుష్షులం ఉండి వారిని కోర్టుకు పంపటం ఏమిటి? కొన్ని విషయాలు పెద్ధ మనుషుల్లో తేల్చుకోవటం మంచిది కదా ?అని తోచి మిమ్మల్ని అడగటం అయ్యింది .
జాస్తి పరమేశ్వర జాస్తి గారు అనేవారు కలుగచేసుకొని 'పెళ్లిలో జరిగే కన్య దాన ఘట్టాన్ని మరొక్క సారి జరిపిస్తే సరిపోతుంది - అంతా చక్క పడుతుంది అని సూచన చేసాడు .
" అల్లా కాదు . అబ్బాయికి జరిగిన ఒడుగు ముహూర్తంలో దోషం వుంది .అందుకనే అతడు బ్రహ్మచర్యం విడనాడలేక పోతున్నాడు ఒడుగు ఇంకోసారి చేస్తే మంచిది " అని వేదాంత జైనులు అనే అయన ప్రతిపాదించాడు .
కేరళవాసి అయినా నారికేళ నాయర్ " దీనికి కేరళలో మంచి వైద్యం వుంది . కొబ్బరి బోండానికి నిలువు బెజ్జం వేసి అందులో ని నీటిలోకి కొన్ని ఆయుర్వేద గుళికలు వేసి మూడురోజులు పాటు నాననివ్వాలి . ఆ తరువాత ఇప్పుడే కాసిన చిటికన వేలు మందము వున్నా లేత ములక్కాయని ఆ కొబ్బరిబోండం రంధ్రంలోకి గుచ్చి -
ఆ ములక్కాడకుండా - ఆ కొబ్బరినీటి మందు రసాన్ని అబ్బాయి చేత పీల్పించాలి - నన్ను అడిగితే ఆ ఏర్పాట్లన్నీ నేను చేస్తాను " అన్నాడు
"చూడబోతే అమ్మాయి ని బిగియారా కౌగలించుకుందామనే అబ్బాయి వచ్చి ఉంటాడు [] కానీ అమ్మాయి చేతిలో పాలగ్లాస్ ఉండగా కౌగిలించుకుంటే సీనుమొత్తం రసాభాస అవుతుందని జంకి ఉంటాడు [] అందువల్ల వెనక్కి వెళ్లి వచ్చి ఇంకో భంగిమలో కౌగలించుకొని పాలను రక్షిద్దామని - అమ్మయిని మెప్పిధ్దాము అని అలోచించి ఉంటాడు పాపం " అని ఎవరికీ తెలియని ఆయన అబ్బాయి తరఫున అన్నాడు

నాగమణి కధ
సూర్య మణీ, చంద్రమణీ. శమంతకమణి, తరువాత పుట్టిన నాలుగో ఆడపిల్ల నాగమణి - ఈఅమ్మాయి పుట్టుక ఆదృష్టపు పుట్టుక అన్నారు . ఇంకా అక్కలు అట్లా అవివాహితులుగానే ఉండగానే ఎవరో ఒక కుర్రవాడు వచ్చి నాగమణిని కోరి వివాహమాడాడు [] అతడు చేసేది చిన్న పాటి షాపు గుమస్తా వుద్యోగం [] ఆ బుద్ధి మంతుడు ఉదయం పోతూ పోతూ నాగమణికి ఇంటి ఖర్చులకని రెండువందల రూపాయలు చేతిలో పెట్టి వెడతాడు , నాగమణి ఆ రొండు వందలతోనే ఇంటికి కావాల్సిన పప్పు ఉప్పు నూనెలు తెచ్చుకోవాలి - ఇల్లు గడపాలి [] అందువల్ల నాగమణి ప్రతి నిత్యం దెగ్గరలోనే వున్నా ఒక సూపర్ మార్కెట్కి వెళ్లి సరుకులు కొని రెండువందల బిల్లు చేసి వస్తూ వున్నది .[] ఆ సూపర్ మార్కెట్ కి ఈ గల్లీలోనే కాకుండా ఊరంతటా కలిపి ఆరు బ్రాంచీలు వున్నయి [] సూపర్ మార్కెట్ వారు 200 లేదా అంతకు పైగా బిల్లు చేసినవారికి ఒక లక్కీ కూపన్ ఇవ్వవటం మొదలెట్టారు []ఆ లక్కీ డ్రా లో మూడవ బహుమతి కింద, నాగమణికి ఇడ్లీ కుక్కర్ వచ్చింది [] అక్కడనుండిఆమె భర్తకోసమని ప్రతి రోజూ ఇడ్లీ పిండి రుబ్బాల్సి వచ్చింది [] దానికోసమని పెరట్లో ఒకమూల పడివున్న పూర్వకాలం రోలును నాగమణి కష్టపడి ఉపయోగంలోకి తెచ్చింది .
నాగ మణీ ప్రతి రోజూ రొండువందలి బిల్లు చేస్తూ వుందికదా ?
అందువల్ల రొండో బహుమతి అయినా ఫ్రిజ్జు కూడాలక్కీగా నాగమణి కె తగిలింది . అప్పుడు షాప్ క్యాషియర్ వచ్చి 'ఆ ఫ్రిజ్యూ "కూపన్ నాకిస్తే నేను

నీకు పాతిక వేలు క్యాష్ ఇస్తాను . ప్రైజ్యూ గెలుచుకున్న అదృష్ట వనితగా మా ఆవిడని చూపించి కంపెనీ ఖర్చుతో ఆమె ఫోటో పేపర్లో వేయుంచుకుంటాను అని ఆఫర్ ఇచ్చాడు [] నాగమణి అందుకు ఒప్పుకొని డబ్బు తీసుకుంది [] వూరిలో వున్నా ఆరు బ్రాంచీలకు కలిపి మెగా డ్రా తీసినప్పుడు మొదటి బహుమతిగా ఐన హెూండా కారును కూడా నాగమణి ఏ గెలుచుకుంది [] కంపెనీ తరఫున మేనేజర్ ఒకాయన వచ్చిఆ కూపన్ తనకి ఇస్తే ఫది లక్షలు ఇస్తానన్నాడు [] నాగ మణీ డబ్బు తీసుకున్నది .
ఇది జరిగిన ఆ రాత్రి నాగమణికి కలలో ఒక దివ్య పురుషుడు కనపడ్డాడు " అమ్మడూ , నాగమణి నేను మీ ముత్తాతకు ముత్తాతను . నావంశంలో నన్ను మించిన అదృష్టం కల వారు ఎవరు పుడతారా ? ఎప్పుడు పుడతారా ? అని నేను స్వర్గలోకంలో ఉండి కొన్ని తరాలుగా ఎదురు చూస్తూ వున్నాను [] . నువ్వు వరుసగా మూడు లక్కీ డ్రా లు గెలుచుకొన్నావు [] నేను ఎదురు చూస్తోంది నీలాంటి వారికోసమే [] నేను బ్రతికి వున్నరోజుల్లలో గొప్ప అదృష్టవంతుడనని పేరుపొందాను [] నేను ఒక రాజుగారి దెగర మంత్రిని , ఆ రాజు చాలా దుష్టుడు [] ఒక రోజు ఆ రాజు అన్యాయంగా నా మీద కోపం తెచ్చుకొని కత్తి ఎత్తి నా తల నరక పోయాడు []నా అదృష్టంబావుంది [] అదేసమయంలో ఆకాశంలో ఒక మెరుపు మెరిసి పిడుగు పడింది [] రాజు నామీదకి కత్తి ఎత్తి వున్నా కారణంగా ఆ పిడుగు ఆ కత్తి మీద పడి రాజు శరీరం కుండా దూసుకు వెళ్లి అతని శరీరాన్ని దహించి వేసింది [] రాజు మరణించాక ప్రజలు ఏకగ్రీవంగా నన్నే రాజును చేశారు [] ఆ రాజఖడ్గాన్ని ఒక జ్ఞపికకాగా నేను దాచుకున్నాను [] ఖడ్గానికి బంగారు పిడి నవరత్నాల తాపడము వుంది [] నన్ను అదృష్టవంతుడిని చేసిన ఆ కత్తిని - నా వంశము లోని నీలాంటి అదృష్టవంతురాలి పరం చేయాలీ అని తర తాలుగా ఎదురు చూస్తూ వున్నాను [] ఇప్పటికి నువ్వు గొప్ప అదృష్టవంతురాలిగా తేలావు [] ఇహ పోతే ఇప్పుడు
ఆ కత్తి నేడు నువ్వు ఇడ్లీ పిండి రుబ్బుకుంటూ వున్నా పెద్ద రోలుకింద వున్నది [] ఆ రోలునీ దొర్లించి ఒక మూరలోతు గుంత తీయి [] నేటికీ ఆ కత్తి తుప్పుపట్టి పోయినా గానీ ఆ బంగారపు పిడి ఆ నవరత్నాలు అల్లాగే వున్నాయి . నేడు ఒక్కొక్క రత్నం తొమ్మిది కోట్ల విలువ చేస్తుంది . నీకు 09x09 =81 కోట్ల ఆస్తి ఇస్తున్నాను" అని చెప్పి మాయం అయినాడు [] అయన అట్లా పోగానే ఒక స్త్రీ నాగమణి కలలోకి వచ్చింది , వచ్చి " అమ్మాయీ నేను ఇందాకటి అయన భార్యను [] ఆయన రాజు కాగానే నాకో రత్నాల హారము చేయించారు [] అది కూడా నీకే ఇధ్ధామనుకున్నాము [] రోలుకింద మూరలోతు గుంతను రొండు మూరలులోతు చేయి నీకు నా రత్నాల హారము దొరుకుతుంది "అని చెప్పి మాయం అయ్యింది []అదే కలలో ఇంకాసేపటికి ఒక అందాల అమ్మాయీ మన నాగమణి కలలోకి వచ్చింది [] " నేను వాళ్ళ ఒక్కగా నొక్క కూతురిని . మా నాన్న నాకు చేయించిన ఏడువారాల నగలు , వంకీల వడ్డాణము రత్న హారాలు అన్నీ కలిపి ఒక బిందెలో పెట్టి మా అమ్మకన్నా ఒక మూర ఎక్కువ లోతులో పాతర వేసాను తీసుకో - అలంకరించుకో " అని చెప్పి వెళ్ళిపోయింది
నాగమణి కలలో తోచిన ప్రకారం మూడు మూరల లోతుకల గుంత తవ్వింది [] అన్నీ కలలో చెప్పినట్లే లభించాయి [] నా అద్రుష్టం గురుంచి ఓ కదా రాయండి మీకో చిన్న మణి ఇస్తాను అని నాగ మణి నాకు ఆశపెట్టినందున ఈ కథ వ్రాశానండీ [] కలలో జేకనపడినా ఆ దివ్య పురుషుడి ఫోటో ఇచ్చాను చూసి ఆనందించండి [] మిగతా వాళ్ళు ఫోతోలు ఇవ్వటానికి ఒప్పుకోలేదు []

నాగమణి కధ

నరకంలో వింత శిక్ష

ఒకాయన నరకంలోకి వెళ్ళాడు [] ఈ యన గొప్ప భూస్వామి [] బాగా చదువు కున్నవాడు [] అందరూ తన లాగే చదువులు చదివితే - ఇక తన కింద చాకిరీ చేసేవాళ్ళు ఎవరుంటారు? అనుకోని ఇతరులకెవరికి చదువు అబ్బకుండా - బడులు బందు చేసాడు [] చివరికి నరకలోకం చేరాడు []

భూస్వామి - వేల ఎకరాలకు ఆసామీ - వందలమంది పాలేర్లకు యజమాని అని గౌరవించి న నరకలోకమ్ వారు - ఒక కుర్చీ వేసి దాని ముందు ఒక బల్ల వేసి ఈయన్ని భోజనానికి కూచో పెట్టారు [] ఒక అందాల సుందరి తిప్పుకుంటూ వచ్చింది " మీ ఆర్డర్ సార్ అని అడిగింది . " బాసుమతి రైస్ అన్నము , పప్పు ఆవకాయ ములక్కాడా సాంబారు - గట్టి పెరుగు విత్ మాంగో " అని ఈయన ఆర్డర్ ఇచ్చాడు

" అలాక్కాదండి - ఇదిగో ఈమెనూ బుక్కు చూసి మీకు కావాల్సింది చూసుకొని దాని సీరియల్ నెంబర్ ఈ స్లిప్పు మీద రాసి నాకివ్వండి [] మీరు కోరినది మా చెఫ్ వండినాక నేను వచ్చి మీకు సర్వ్ చేస్తాను " అన్నది

మెనూ పుస్తకం వెయ్యి పేజీలకు పైగా వుంది [] పేజీకి రొండువందల ఎంట్రీ లు వున్నాయి[]

సీరియల్ నెంబర్ ఒకటి తో మొదలై - 219221 వద్దముగిసింది [] మనవాడు ఎంట్రీ లన్నీ జాగర్తగా పరి శీలించగా సీరి యల్ నెంబబు 118638 వద్ద అన్నము కనపడింది - ఇక పప్పు కోసము వెతుకుతూ ఉంటే ఆ అందాల అమ్మాయి వచ్చి " సారీ అండీ మీకిచ్చిన టైం అయిపొయింది అని మెనూ బుక్కు లాక్కుంది [] కానీ సార్ మా స్టాండర్డ్ ఐటెం ఇవ్వమంటే ఇస్తాము - లేదంటే ఇవాళ్టి మీ కు పస్తు " అని చెప్పింది [] అప్పటికే నీరసం వచ్చిన ఈయన " ఆకలితో చచ్చేటట్లున్నాను- ఈ రోజుకు అలాగే కానివ్వు "అన్నాడు - అమ్మాయి వెళ్లి చిన్న కుండ మూకుడులో ఇంత గంజి నాలుగు మెతుకుల అన్నం , పచ్చి మిర్చి తెచ్చి ఇచ్చింది [] ఇది అయన తింటాడో లేదో అయన ఇష్టం []

కొంత సంభాషణ అనంతరం అమ్మాయి ఇట్లా అంది - "రేపుకూడ ఇలాంటి పుస్తకమే ఇచ్చి సెలక్షన్ కోసం మీకు గంట సమయం ఇస్తాము - ఇవాళ్టి పుస్తకం - రేపటి పుస్తకం ఒకటి కాదు []సీరియల్ నెంబర్లు జంబ్లింగ్ చేస్తాము [] ఇవాళ 118638 వద్ద వున్నా అన్నము అన్న ఐటెం రేపు 198668 దెగ్గర ఉండవచ్చు లేదా 100 దెగ్గర ఉండవచ్చు - మీ అదృష్టము "అన్నది [] దొరగారు రోజూ ఈ గొడవ పడలేక " స్టాండర్డ్ మెనూ అయినా " ఇంత గంజి నాలుగు మెతుకుల అన్నం , పచ్చి మిర్చితింటూ నరక వాసం చేయ సాగాడు []

విద్యని ప్రోత్సహించని వారికి ఈ శిక్ష ఉంటదని నారదుడు పురాణాల్లో చెప్పాడు

చ్చు చ్చు .. మంత్రం - చికాకు మంత్రం

ఈ కధ రాసిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ

ఒక వూరిలో శరభయ్య అనే అయన ఒకడున్నాడు [] వాడి తండ్రి వాడిని పెద్ద రైతుని చేశాడు [] శరభయ్య త్రండి భయం వల్ల ఒక యువతిని , తల్లి ప్రేమకు లొంగి ఒక యువతిని పెండ్లి ఆడాడు [] ఆ రోజుల్లో అది మామూలే [] శరభయ్య పెద్ద భార్య పేరు పెద్దావిడ [] చిన్న భార్య పేరు చిన్నావిడ అని ఇంటిపాలేర్లు

నిర్ణయించారు [] ఒకనాడు పెద్దావిడ మధ్యాహ్న భోజనానికి భర్త రాకడ కోసం ఎదురు చూస్తూ వాకిలి గుమ్మము దెగ్గర నిలిచి వుంది [] ఆమెకు అప్పుడే చిన్నావిడతో ఒక తగాదా మరియు కొప్పు యుద్ధము జరిగింది [] దానితో ఆమె చాలా చికాకుగా వుంది [] ఇంతలో ఒక సాధువు అటుగా వచ్చి పెద్దావిడను చూసి " అమ్మా , ఏదన్న తిని మూడు పూటలైనది . ఇంత కబళం పెట్టించు తల్లి అని అడిగాడు [] పెద్దావిడ ధర్మాత్మురాలు - గృహ మర్యాదలు తెలిసినది [] ఆమె సాధువును ఆదరించి సుష్టుగా భోజనం పెట్టింది [] భోజనం అయినాక సాధువు ఏమన్నాడంటే " అమ్మా నీలోను , నీ ఇంటిలోనూ కోపము /చికాకు రాజ్యం ఏలుతున్నాయి . వాటి ని మీ ఇంటినుండి పారద్రోలటానికి నా దెగ్గర ఒక మంత్రం వుంది. నువ్వు ఏదన్న దేముని పటం పట్టుకురా .. దానిమీద ఒక మంత్రం రాసి వెడతాను - ఇక నువ్వు ఆనందంగా ఉంటావు " అని చెప్పి - చెప్పిన విధంగా మంత్రం రాసి నవ్వుకుంటూ వెళ్లి పోయాడు[] ఈ కథ రాసిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ

మరు నాటి నుండీ ఇల్లా జరగటం మొదలైంది [] పెద్దావిడ - చిన్నావిడ చేష్టలుగాని - మాటలు గానీ - అలంకరణగానీ నచ్చక ఏదన్న చికాకు పడింది అనుకోండి - అప్పుడు ఆమె ఆధీనంలోవున్న వంటపాత్రలలోని ఇత్తడి గిన్నె ఒకటి అకస్మాత్తుగా గాలిలోకి లేచి - చిన్నావిడ ఇంటిలోకి వెళ్లి - పెద్ద శబ్దము చేస్తూ కిందబడి పగిలి పోయేది []దీంతో చిన్నావిడ దడుచుకొని చచ్చింది [] ఇలాగ ఆరోజల్ల జరిగింది [] తనకు దొరికిన చికాకు మంత్రం చక్కగా పని చేస్తున్నందుకు పెద్దావిడ ముందుగా చాలా సంతోషించింది [] కానీ తనపుట్టింటి వారు ఇచ్చిన గిన్నెలు ఆలా పుచ్చకాయల్లా పగిలి పోవటం ఆమెకు నచ్చలేదు పుట్టింటి వారిచ్చిన గిన్నెలు కాపాడు కోవటం కోసం తన చికాకు తగ్గించుకోవటం మాత్రమే ఏకైక మార్గం అని తెలుసుకుంది []

[][][]ఇది ఇలావుంటే [][][][]

చిన్నావిడ - పెద్దావిడ మీద చికాకు పడ్డప్పుడు కూడా చిన్నామెకు సంభందించిన ఇత్తడి గిన్నెలు కూడా గాలి లోకి లేచి . వెళ్లి పెద్దావిడ ముందు పగలసాగాయి [] చిన్నావిడకు మంత్రం సంగతి తెలియక పోయినా - తాను పెద్దావిడ మీద చికాకు పడ్డప్పుడల్లా తన పుట్టింటి వారు ఇచ్చిన గిన్నె ఒకటి పగిలిపోవడం గమనించి - తన చికాకుకు - పెద్దావిడకు -మరియు గిన్నెలు పగల టానికి ఏదో లింకు ఉందని కని పెట్టింది [] పుట్టింటి వారిచ్చిన గిన్నెలు కాపాడు కోవటం కోసం తన చికాకు తగ్గించుకోవటం మాత్రమే ఏకైక మార్గం అని చైన్నైడా కూడా తెలుసుకుంది [] వీటి పర్యవసానంగా , తమ పుట్టింటి వారు ఇచ్చిన గిన్నెలను భద్రంగా కాపాడుకోవటానికని పెద్దవిడా చిన్నవిడా ఇరువురు కూడా చికాకులు తెచ్చుకోవటం మాని - అక్కా -- చెల్లీ అని పిలుచుకుంటూ ఆనందం గా ఉండసాగారు [] ఈ కథ రాసిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ

ఇద్దరు భార్యలు వున్నా భర్త పరిస్థితి కూడా చికాకుగానే ఉంటుంది [] భార్యలు పెట్టె చికాకులు భరించలేక శరభయ్య ఇంట్లో ఉండెడిది తక్కువ చేసాడు [] ఒక రోజు సాయంత్రం అతను ఇంటికి రాగానే పెద్దవిడా , చిన్నావిడ - ముందుగా కూడాపలుక్కోక పోయినా - ముందుగానే కూడా పలుక్కున్న వాళ్ళ మాదిరి , ఇంతెత్తున లేచి " అయ్యిందా నీ గాలి తిరుగుడు - ఆకలి అయితే గాని ఆలి గుర్తుకు రాలేదా అని శరభయ్యను సాధించటం మొదలు పెట్టారు [] " ఛీ ఊరుకోండి - ఎప్పుడు ఇంటికి వచ్చినా ఇదే రభస " అని శరభయ్య చికాకు పడ్డాడు [] అప్పుడుఅనగా శరభయ్య చికాకు పడ్డ వెంటనే - పెద్దావిడ

ఇంటిలోనుండి ఒక కంచు గిన్నె లేచివచ్చి చిన్నావిడ తలమీదా , చిన్నావిడ ఇంటిలోనుండి లేచివచ్చిన ఒక కంచు పళ్ళెము పెద్దావిడ తల మీదా పడ్డాయి [] వాళ్ళ తలలు బొప్పి కట్టాయి [] ఇలా ఎందుకు జరిగిందంటే - పెద్దావిడ రెచ్చి పోతూ ఉంటే చిన్నవిడా , చిన్నవిడా , చిన్నావిడ రెచ్చి పోతూఉంటే పెద్దవిడా - వెనక్కు లాగవచ్చు కదా ? ఒక్కరూ ఆలా చేయలేదు . అందుకని పైలాగా జరిగింది []ఈ కథ రాసిన వారు వారణాసి శ్రీ రామ కృష్ణ
సాధువు వేసిన చూ చూ మంత్రం చికాకు మంత్రం కారణంగా శరభయ్య ఇంట్లో చికాకులు
తగ్గి హాయిగా ఇంట్లో ఉంటూ , భార్యలు భయ భక్తులతో పెట్టిన భోజనాన్ని - కొత్త పెళ్లి కొడుకుకు మల్లె తిని ఆనందించసాగాడు [] శుభమస్తు నిత్యం

సరికొత్తగా
సరి కొత్తగా ఏదన్న ఆలోచించండయ్యా ? ఒక ఐడియా జీవితాన్నే మార్చేస్తుంది " అని నేను అందరితో డప్పు కొడుతూ వుండే వాడిని [] ఇది చూసి వళ్ళు మండిన మా పూర్వ విద్యార్థి ఒకడు "ఆలోచించు ఐడియా " అని ఊదరకొట్టటం కాదు - నాకోసం అని మీరే ఏదన్న ఐడియా చెప్పి, ఎలాగైనా  ఏదన్న బ్రతికే మార్గం చూపించండి అన్నాడు [] ఆ నా శిష్యుడు ఇంగిలీషులో దిట్ట [] షార్ట్ హ్యాండ్ నేర్చాడు [] వాడితో నేను అన్నాను ' ఒరేయి నాయనా .. బస్సు స్టాండింగ్లోనో రైల్వే స్టేషన్ లోనో చూడు [] ఒక భుజాన బ్యాగ్ వేసుకొని ఒకచెవికి ఫోన్ తగిలించుకొని .. ఆ..  సార్ సా ర్ అంటూ అవతల  తమ బాస్ చెప్పినది అరచేతులమీద రాసుకుంటూ వుండేవాళ్ళు అనేకంగా కనపడతారు [] నువ్వేమి చేస్తావంటే  ఒక నోటుబుక్కు పెన్సిల్ పట్టు కొని వాళ్ల పక్కన నిలబడి " నాకు చెప్పండి బ్రో .. నాకు షార్ట్ హ్యాండ్  వచ్చు . అంత చక్కగా రాసి పెడతాను అని అడుగు []వారు ఆశ్యర్యపడి యో అవసర పడియో నీకు తాము ఫోనులో వింటున్నది రాసుకోమని చెపుతారు [] వారు చెప్పిన వివరాలు చక్కగా రాసి దాన్ని వారి చేతుల్లో పెట్టు [] నీవు రాసిఇచ్చిన వివరాలు ఒక్కొక్క సారి ఏదో పెద్ద మీటింగుకు లేదా కోట్ల రూపాయల వ్యాపారలావాదేవీలకు సంబంధించినవి అయి ఉండవచ్చు [] వారు నీకు  మర్యాదపూర్వకంగా  టీ ఇప్పించి నీసేవలకుగానూ , ఒక యాభై చేతిలో పెట్ట వచ్చు లేదా భోజనానికి ఒక యాభై ఇవ్వమని నువ్వే అడుగు []వెళ్లు వెళ్లి ఈ నూతన వృత్తిని శురూ చేయి అని సలహా ఇచ్చాను [] నా శిష్యుడు వృత్తిలోకి లంఘినుచ్చుకొని  రోజుకు మూడునాలుగువందల కళ్ళ చూసాడు [] ఒకనాడు వాడి కిస్మత్ ఫిరాయించి - రైల్వే ప్లాట్ఫారం మీద - ఫోను లో వింటూ అరచేతిలో రాసుకుంటూ వున్నా ఒక పెద్ద మనిషి దెగ్గరికి వెళ్లి తన సేవలు ఆఫర్ చేసాడు [] ఫోనులో వింటూ వున్నా  అయన ఒక పెద్ద కంపెనీకి మేనేజర్ [] మాట్లాడుతున్నది వాళ్ల కంపెనీ డైరెక్టర్ [] ఆ డైరెక్టర్ గంటపాటు పాతిక రకాల ఇంస్ట్రుక్షన్స్ ఇచ్చాడు [] మనవాడు ఓపికగా రాస్తే అదంతా కలిసి నాలుగు పేజీలు అయ్యింది []ఈ నాలుగు పేజీలువిని గుర్తు పెట్టుకోవటం, వీటిపై  నెక్స్ట్ మీటింగ్లో చర్చించటం నా వల్ల అయ్యేది కాదు [] సమయానికి ఇతడెవరో చొరవగా వచ్చి గండం దాటించాడు ' అని ప్రాణాలు లోపలికి పీలుచుకొని - మావాడికి సంవత్సరానికి ఆరు లక్షల ప్యాకేజీ తో వుద్యోగం ఇచ్చాడు [] ఒక ఐడియా ఎప్పుడూ జీవితాన్ని మారుస్తూ నే ఉంటుంది []

కైలాస యాత్ర 10-06-22
ఒకానొక దేశం లో ఒక కొండ ప్రాంతం లో ఎంతో ఎత్తు కలిగిన గిరి శిఖరము ఒకటి ఉండేది .
ఆ శిఖరం మీద ఒక చిన్న నీటి ఊట మొదలై ఒక జాపాతంగా మారి వేయి అడుగుల క్రిందకి దుమికి ఒక సరోవరాన్ని ఏర్పరిచింది [] పర్వత రాజ పుత్రి అయినా పార్వతీ మాతకు పర్వతములన్నీ ఆమె పుట్టింటిలోని భాగాలే అనుకోవాలి [] అందుచేత పార్వతీ అమ్మవారు ఈ సరోవరానికి తరచూ వచ్చి స్నానమాచరించి వెడుతూ ఉండేది []
పార్వతీ అమ్మవారు ఈ తావుకు వచ్చి జలకాలు ఆడుతున్నదని యోగదృష్టితో గ్రహించిన ఒక యోగి . ఆ సమాచారాన్ని ఆ కొండలు ను ఆశ్రయించుకొని బ్రతుకుతూ వున్నా ఒక కొండజాతి తెగ నాయకుడికి తెలియ పరిచాడు [] ఆ నాయకుడు తన ఆటవిక పద్ధతిలో ఆ కొండ కొమ్మున అమ్మవారి ఆలయం నిర్మింప చేసాడు [] ఈ ఆలయ నిర్మాణం వల్ల ఖఠినమైనదే అయినా ఒక సన్నని దారి కొండ కొమ్ముమ్మవరకూ ఏర్పడింది [] ఈ కొండ వున్నా రాజ్యానికి చెందిన రాజు బహు క్రూరాత్ముడు [] అతడు తనకు గిట్టని వారిని , శత్రువులను ఈ కొండకొమ్ము కు తీసుకువచ్చి జలపాతం లోకి త్రోయించి వారిని హత్య చేయించటం అలవాటుగా పెట్టుకున్నాడు [] జలపాతంకుండా క్రిందకు పడుతున్న వారి ఆర్తనాదాలు అమ్మవారి చెవిన పడ్డవి [] తాను స్నానమాడిన జలపాతం కారణంగా ఏర్పడిన గుడి - ఆ గుడి కారణంగా ఏర్పడిన దారి - ఆ దారి వున్నా కారణం గా జరుగుతున్నా హత్యలను చూసి అమ్మవారు కలత చెందినది [] అప్పుడు పార్వతీ దేవి ఇట్లా అనుగ్రహము చూపింది " జలపాతంలో పడ్డ వారు ఎవరైనా కానీ క్రిందికి వచ్చే సగం దారిలో పక్షులుగా మారి పోతారు [] చని పోవటానికి ముందు వారు తాము ఎక్కడికి వెళ్లి అయితే సంతోషంగా జీవించ గలము అని భావించారో - అక్కడి వరకు వారు పక్షి రూపంలోనే ప్రయాణించి అక్కడ వాలుతారు [] అక్కడ తిరిగి నేలను తాకగానే మనుషులుగా మారి నూతన జీవితం ప్రారంభిస్తారు [] ఇదీ అమ్మవారు కారుణ్యముతో చేసిన ఏర్పాటు []
గుడిని నిర్మింప చేసిన ఆటవిక తెగ నాయకునికి గౌరీ అనే పేరుగల కూతురు వున్నది [] ఆమె తండ్రి ఆమెను - అమ్మవారికి నైవేద్యం సమర్పించి రమ్మని కొండ మీదకు పంపుతూ వుండేవాడు [] ఈ కొండ దారిమధ్యలో గౌరికి మేనబావ వరుస అయ్యే శంభుడు అనే యువకుడు జత కలుస్తూ తోడుగా నడుస్తూ ఉండేవాడు [] ఇద్దరిమధ్య ప్రేమ చిగురించి వటవృక్షం అంత అయ్యింది [] ఒక నాడు గౌరీ కొండమీద గుడికి చేరినాగాని శంభుడి జాడ లేదు [] మార్గ మధ్యంలో వాడి కాలులో ముల్లు విరిగింది [] గౌరీ కొండకొమ్మున నిలబడి పైకి వచ్చే కాలి బాట వంక చూడగా కుంటుకుంటూ వస్తున్నా శంభుడు కనపడ్డాడు [] గౌరీ అతడికి కాలు విరిగిందేమో అని భ్రమ పడి , అమ్మ వారి వంక తిరిగి " ఇదేనా నీ మహిమ ? ఇందుకేనా నీకు పూజలు ? నీవు ఎటువంటి దానివి ? అని తూలనాడింది [] అమ్మ వారి సంగతి ఆలాగున ఉంచితే , ఆమె వాహనమైన పులికి అమిత కోపము వచ్చింది [] అది అమాంతము గౌరీ మీదకు దూకి ఆమెను ఖండఖండాలుగా చీల్చి వేసింది [] కానీ అమ్మవారు చిరునవ్వు నవ్వుకుంటూ , గౌరీ ఆత్మను తన చేతిలోకి తీసుకొని - దానిని ఒక రాతిలోకి ప్రవేశపెట్టి - ఆ రాతికి గౌరీ యొక్క రూపం కల్పించి - ఆ రాతిబొమ్మను తీసుకొని వెళ్లి గుడి ఎదురుగా వున్నా ఒక చెట్టు తొర్రలో దాచింది [] శంభుడు గుడివద్దకు చేరేసరికి గౌరీ కాళ్ళు చేతులు విడి పడి

పోయి పొట్టలోని పేగులు బయటికి రాగా విగత జీవి అయి పడి వున్నది [] శంభుడు గౌరీ లేని దుఃఖము తట్టుకోన లేక మనసుస్సులో " ఆమెవెళ్లిన చోటుకే { అతని దృష్టిలో మరణ లోకం } నేనూ వెళ్లి సుఖఃము గా వుంటాను అని సంకల్పించుకొని జల పాతం లోనికి దూకాడు [] జలపాతం మీద అమ్మ వారికి వున్నా వరం వల్ల శంభుడు సగం దారిలోనే పక్షిగా మారి , ఎగురుకుంటూ వచ్చి , గౌరీ యొక్క రాతి బొమ్మ ఏ చెట్టు తొర్రలో వున్నదో ఆ చెట్టు తొర్రలోకి చేరాడు [] అతడు మనిషిగా మారి గౌరీ బొమ్మను గుర్తించి దానిని చేతులలోకి తీసుకొని పలు రకాలుగా దుఖియించాడు [] అతడు ఒక జానెడు పొడుగు వున్న ఆ రాతి బొమ్మను , తమ గూడేనికి తీసుకు పోయి గౌరిని పులిచంపటం తనకు ఈ రాతి బొమ్మదొరకటం గురించి చెప్పాడు [] అందరూ తాను అపహాస్యము చేస్తారు ఏమో అన్న భయంతో అతడు తాను పక్షిగా మారిన సంగతిని మాత్రమూ ఎవ్వరికీ తెలుపలేదు [] ఇప్పుడు గౌరీ బొమ్మను ఏమి చేయాలనే సందేహం కలిగింది [] కొందరు ఆమెకు గుడి కట్టి ఆ మందిరములో ఉంచాలన్నారు [] శంభుడు అందుకు ఒప్పుకోక - ఈ అరణ్యాలు అన్నీ గాలించి యోగులను మునులను మంచి చేసుకొని , ఈ రాతి ప్రతిమకు ప్రాణం తెప్పించు కుంటాను " అని ప్రతిన పూని ఒంటరిగా భీకర అరణ్యాలలో మునులను యోగులనూ వెతుకుతూ తిరగ సాగాడు [] ఈ కథ వారణాసి శ్రీ రామ కృష్ణ అనబడు నాయొక్క సొంత కథ [] చిన్న చిన్న యోగులు కొందరు - బొమ్మకు పూజలు చేయమని , బలులు ఇమ్మని , సరసు జలాలలో ముంచి తీయమని సలహాలు ఇచ్చారు [] కానీ అవేమీ పని చేయలేదు [] ఒక యోగి నీవు ప్రతిమను ముద్దులాడు అని సలహా ఇచ్చాడు [] అల్లా చేసినప్పుడు , రాతి విగ్రహం యొక్క చేయి జీవము తెచ్చుకొని - శంభుడి యొక్క చెవి తమ్మెను బలంగా నొక్కి పట్టి మెలితిప్పింది []శంభుడు తనని పెండియాడటానికి ముందే ఈలాగు చేయటం తనకు నచ్చదు అన్న విషయం తెలియ చేయటానికే గౌరీ శంభుని చెవిని మెలివేసింది []
చివరికి ఏమయితేనేమి బొమ్మయొక్క రాతి చేతిలో శంభుడి చెవి ఇరుక్కుపోయింది [] ఎంత గుంజినా కానీ అది ఊడిరాలేదు [] జానెడు పొడుగు కిలో బరువు వున్నా ఆ రాతి విగ్రహం శంభుడి చెవిని వేలాడసాగింది [] ఈ కథ వారణాసి శ్రీ రామ కృష్ణ అనబడు నాయొక్క సొంత కథ[] చివరికి ఒక మహాముని వీడి అవస్థను గమనించి " ఒకరు చెప్పినట్లు కాక - నీమనసుకు తోచినట్లుగా చేయి" అని సలహా ఇచ్చి - నీ వు చెవుని కత్తిరించుకొని ఆ బొమ్మను విడిపించుకో ఆ పై ఆ బొమ్మను నీఇష్టం వచ్చినట్లు చేసుకో" అని సలహా ఇచ్చాడు [] శంభుడు తన బాణంతో తన చెవును కోసుకొని బొమ్మ నుండీ విడిడిపించుకున్నాడు [] ఆపై కోపముతో ఆ బొమ్మను విసిరి పారవేయటానికి బదులు " ఓ నా ప్రాణమా - నీకు ఎన్ని చిక్కులు వచ్చినవి " అని కనుల నీరు నింపుకుని , ఆ బొమ్మను ఘాఢముగా గుండెలకు హత్తుకున్నాడు [] ఆ వెంటనే గౌరీ యొక్క రాతి బొమ్మ మనిషి గా మారింది [] ఇద్దరూ కలిసి అమ్మవారి ముందు చేతులు కలుపుకొని ఏడూ అడుగులు నడిచి వివాహం చేసుకున్నారు []అమ్మవారి దయవలన శంభుడు గొప్ప రాజు అయి ఆ కొండమీదనే గొప్ప కోటకట్టుకున్నాడు [] గుడిని ఎంతో వైభవంగా పునర్ నిర్మింపచేశాడు [] కొన్నాళ్ళకు శంభుడు ముసలి వాడు అయినాడు [] మరణం ఎంతో దూరంలో లేదని గ్రహించి - తాను జలపాతంలో దూకుతూ అనుకున్న దానిగురించి , ఆ తరువాత పక్షిగా మారి చెట్టుతొర్రలో దూరటం గురించి గౌరితో ముచ్చటించాడు [] అప్పటికి గౌరికూడా వృద్ధురాలైనది [] పిల్ల పాపను చూసింది[] ముని మనుమళ్లను ఎత్తింది [] ఆమెకు భర్తతో పాటు

కలసి మరణించ వలెనన్న కోర్కె వున్నది [] ఆమె బాగా అలోచించి . జలపాతంలో దూకిన వారు - తాము సంతోషము తో జీవించగలము అనుకున్న ప్రాంతానికి పక్షి రూపములో ఎగిరి పోగల శక్తి పొందుతారని గ్రహించింది [] ఒకనాడు గౌరీ మరియు శంభుడు రాజ్యము కుమారులకు అప్పచెప్పి - మేము కైలాసము వెళ్ళిసుఖముగా ఉంటాము అని మనసులో సంకల్పించుకొని - జల పాతం లోకి దూకారు [] అమ్మ వారి వరమువల్ల వారు పక్షులుగా మారి తిన్నగా కైలాసములో వాలారు [] అక్కడ తిరిగి నిజరూపాలు పొందారు []

===========================

నిన్న అనగా 09 -౬-22 సాయంత్రము టీ తాగుతూ " అమ్మా ఏమన్నా ముచ్చట చెప్పవమ్మా" అని అంబను అడిగినపుడు ఆమె పై ఊహలను విషయాలను అందించినది - అదియే రాసాను - ఆమె చెప్పిన ఈ కధ పరమేశ్వరుడు వినోదార్ధము తనకు చెప్పిన కధ అయి ఉండ వచ్చునులేదా ఇదిఒక నిజము కధ కావచ్చును లేదా ఒక అభూత కల్పనా కూడా కావచ్చును

" అంబా ఇంత చెప్పినదానివి , ఇంత వూహ కలిగించిన దానవు వు ఆ ప్రదేము ఏమిటో ఆ జలపాతము ,ఆ సరస్సు ఎక్కడవున్నావో చెప్పి మమ్ము అనుగ్రహించ రాదా? అని వేడినాను

అందుకు గాను అంబ ఎమన్నా డంటే ' ఈ కధలోని మాధుర్యము అనుభవించావు కదా ? తీపి తరువాత కారం తిన్నట్లుగా వున్నా విషయము ఏమిటంటే " మీ మనుషులు ఆ మొత్తము కొండను తవ్వి వేసి, కంకరగా మార్చి ఇల్లులు బ్రిడ్జీలు కట్టుకున్నారు -రోడ్లు వేసుకున్నారు . అసలు కొండా అన్నదే లేనప్పుడు జలపాతం ఎక్కడిది ? ఇక సరస్సు ఎక్కడిది ? ఇక నా వరము ఎక్కడున్నది ? నీవు కైలాసము రావాలని ఆశపడితే నేను చూసుకుంటాను [] అందరికోసము అయితే" రాస్తా నై " లేదా దారి మూయబడినది అని చెప్పుము " అని తెలియ పరుచుము అని చెప్పి - టీ కప్ ఖాళీది అక్కడ పెట్టి వెళ్లి పోయింది

చిన్న హత్య -- 09 -06 -22

" చావవే ముండా చావు " అన్న అరుపులు , ఒక కర్రతీసుకోని మెత్తని వంటిమీద దబిడీ దిబిడీ బాదుతున్న చప్పుళ్ళు, దానికి బదులుగా " చంపండి చంపండి ఫీడ వదిలిపోతుంది " అన్న స్త్రీ అరుపులు పక్క ఇంటిలోనుండి బయటకు వినపడుతుండటంతో, బేజారెత్తి పోయాడు రామేశ్వరం గారు [] నిన్న రాత్రి టీవీలో ఒక భర్త ఒక భార్య ని దారుణంగా హత్య చేసిన విషయాన్నీ బ్రేకింగ్ న్యూసుగా 24 గంటలూ చూపించారు [] చివరికి పోలీసులొచ్చి " పక్కింటి వారిని పట్టుకొని " మీరేమి చూసారో - మీరేమి చేశారో మా ఎస్పీగారికి వివరించుదురు గాని పదండి" అని వారిని ఉదయాన్నే పోలీసు స్టేషన్ కి పట్టుకుపోయి అర్ధరాత్రికి ముందు వదిలేశారు [] ఈ న్యూస్ కూడా టీవీ వల్లే ప్రసారం చేసాబు [] ఇప్పుడు ఆ టీవీ సీనులన్నీ రామేశ్వరం గారి కాళ్ళ ముందు గిర్రున తిరిగినవి []

తన పక్కింట్లో ఏదో హత్య జరుగుతుంటే, పొరుగు వాడిగా వుంది తానేమీ పట్టించుకోక పోతే " నువ్వు చూస్తూ ఎందుకూరుకున్నావు - ఈ హత్యకు నీ మద్దతు ఉందని అనుమానం గా వుంది "అని పోలీసులు తనను విచారణపేరుతో తనను పట్టుకుపోతారేమోనని రామేశం గారికి భయ ము కలిగింది [] వెంటనే ఫోన్ తీసి వన్ హండ్రెడ్ కి డైలు చేసి పక్కింట్లో గృహ హింసా , స్త్రీ హత్య జరుగుతున్నదని తెలియ పరిచాడు [] తాను విన్నవి చెప్పాడు [] మీరు ఇంకా ఏమి విన్నారు అని

అడిగారు పోలీసు వారు " పిల్లలు కీచు కీచునా అరుస్తున్నారు " నెత్తురు వస్తుంది నాన్నా కొట్టవద్దు నాన్నా చస్తుంది నాన్న అని బ్రతిమాలుకుంటున్నారు - అదికూడా విన్నాను " అని చెప్పాడు రామేశం గారు [] ఒక గృహహింస, ఒక హత్య, చిన్న పిల్లల ముందు దాష్టికం వంటి నేరాలు జరుగుతున్నావని పోలీసు వారు గ్రహించి - ముందు తాము వెనుక సైరెన్ వేసుకుంటూ వస్తున్నా అముబులెన్సు ని తీసికొని రామేశం గారి ఇంటి ముందు ఆగారు []
పోలీసు వారిని వెంటపెట్టుకొని , వారుఉన్నారన్న ధైర్యం తో గృఅహింస జరుగుతున్నా పక్క ఇంటితలుపు తట్టి " ఏమయ్యా రమేషూ - ప్లీజ్ తలుపు తీయి అని అరిచాడు '
" ఏమిటండీ ఈ ఆదివారం పూట ? ఏదన్న ఆర్జెంట్ పనియా ? ఫది నిమిషాలు లాగండి -ఇల్లంతా రక్తం మరకలతో అసహ్యంగా వుంది - కడిగినాక నేనే ఫోను చేసి మిమ్మల్ని పిలుస్తాను" అని లోపల నుండి సమాధానం వచ్చింది . ఆ తరువాత చీపురు పెట్టి బరబరా ఫ్లోరుని రుద్దుతున్న చప్పుడు కూడా వచ్చింది [] ఇక పోలీసు వారు ఆగలేక పోయారు [] తలుపులు బద్దలు కొట్టి లోపలికి దూరారు [] ఇంటాయన నేలమీదవున్న రక్తం కడుగుతూ వున్నాడు [] ఇంటావిడ పచ్చడి పచ్చడి అయి రక్తం కారుతున్న పందికొక్కును చూసి మూర్చపోతూ తేరుకుంటూ ఉన్నది [] పంది కొక్కును బయట పారవేయటానికి వీలుగా పందికొక్కు ను ఒక చాట వంటిదాని మీదకు ఎత్తి పెట్టాడు [] పిల్లలు చీపురు పుల్లలు తీసుకొని దాన్ని పొడిచి చూసున్నాబు [] దేముడి దయవల్ల హత్య ఏదీ జరగలేదని పోలీసులు సంతోషించారు గాని రామేశమ గారికి ఒక సారి స్టేషన్ కి రండి అని చెప్పి వెళ్లి పోయారు []
పంది కొక్కు ను చంపిన రమేష్అనే అతడు రైతు వారీ వర్గానికి చెందిన యువకుడు [] సొంత వూళ్ళో వుండే రోజుల్లో , పంట నూర్పిడుల సమయములో ధాన్యం కుప్ప ల దెగ్గర కావలి పాడుకొనేవాడు - అలాంటప్పుడు ఒక గట్టి పొడుగాటి ఇనుప ఊచ తీసుకుని , ధాన్యం కుప్పలా జోలికి వచ్చిన ఎలుకలను , అతి లాఘవముగా పొడిచి చంపుతూ ఉండేవాడు [] ఒక రాత్రికి సుమారు నూరు ఎలుకలవరకూ చంపినా రోజులున్నాయి [] ఎలుకలను చంపటం ఒక మజా గా మారినాక అతడు కావాలని పగటిపూట పొలం గట్ల మీద తిరుగుతూ ,ఎలుక బొక్కలు కనపడగానే దానిలోకి ఇనుప వూచని గుచ్చుతూ ఎలుకలను వేటాడటం ఒక హాబీగా పెట్టుకున్నాడు []ఆ తరువాత అతడు పట్టణంలో ఎదో ఉదోగం సంపాదించి - ఊరిని పొలాలని - ఎలుకలను వదిలిపెట్టి - పట్టణంలో స్థిరపడ్డాడు [] ఇతడి ఇంటి కిటికీ వెనకాల పారేసిన ఆహారాన్ని చూసి ఒక పంది కొక్కు ముందుగా కిటికీ వెనక్కి , కిటికీ తెరిచి వున్నప్పుడు ఇంట్లోకి రాసాగింది [] ఇంటావిడకి
ఎలుకలనా బొద్దంకులన్న తగని భయం [] ఆమె పుట్టిన తరువాత పందిపిల్ల అంత వుండే ఈ పందికొక్కులు చూసిందే లేదు [] పంది కొక్కు గురించి భర్తకు చెప్పి అభయం వేడింది [] ikanemi మనవాడికి యవ్వనోద్రేకం పొంగుకు వచ్చింది [] పైగా మనవాడికి ఎలుకల వేట అన్నా పందికొక్కుల వేట అన్న వెన్నతో పెట్టిన విద్యనే గదా ? పైగా ఇప్పుడు భార్య ముందు తన ప్రతాపం చూపించుకొనే సమయం వచ్చింది గదా - ఇదికకక పాత హాబీలోని మజా తలుపుకు వచ్చింది [] రమేష్ ఎంతో మేలుకవాతో పందికొక్కు కోసం ఎదురు చూసి అది లోపలి కి రావటం కనిపెట్టి వెంటనే దాని మీద పెద్ద మొద్దు దుప్పటి వేసి దాన్ని కర్ర తీసుకొని చితక బాది వదిలాడు [] చంపండి చంపండి ఫీడ

వదిలిపోతుంది " అన్న స్త్రీ అరుపులుఅప్పుడు వచ్చినవే [] " నెత్తురు వస్తుంది నాన్నా కొట్టవద్దు అని పిల్లలు బ్రతిమాలుకుంటు అరిచినా అరుపులు కేకలు - మొదటి సారిగా తమముందు జరుగుతున్నా జీవహింసను చూసి తట్టుకొళాక పిల్లలు వేసిన కేకలే .
బై వారణాసి శ్రీ రామకృష

**ADDRESS ది SARROW అండ్ ది WORRIED 08-06-22**

ప్రజల యొక్క ఆందోళనను మరియు దుఃఖాన్ని ఉద్దేశించి జీవించండి " అని పైమాటల యొక్క భావము.

బుద్ధభగ వానుని బోధనల సారము పైమాటలలో ఇమిడి వున్నది అని దీనిని అన్నవారు మనసా వాచా నమ్మాడు [] ప్రజలకు వున్నా దుఃఖాన్ని ఉద్దేశించి ఆలోచించినందువల్లనే కదా బుద్ధుడు - బుద్ధభగవానునిగా మారి కోట్లాది ప్రజలను ప్రభావితం చేయగలిగాడు ? అందు వల్ల పైమాటలలో అక్షర సత్యము వున్నది []

పై మాటలను ఎవరు అన్నారు అంటే - రిస్ట్ వ్వాచీలు ఉంటాయి కదా - దానిలో వుండే గంటల ,నిమిషాల , సెకండ్ల ముల్లును తయారు చేయటం లో ఎంతో అనుభవం కలిగి, వుద్యోగం నుండి విశ్రాంతి పొందిన ఒక వ్యక్తి అన్నాడు[] ఇతని పేరు నేను మరిచి పోయాను కానీ నేను ఇతని ని అమితాభుడు అని పిలుస్తాను []

మనము, మన సీకో లేదా రీకో లేదా సిటిజెన్ వాచీ ఇరవై ఏళ్లుగా చక్కగా పని చేస్తున్నది అని చెప్పుకుంటాము [] అంటే ఇదే ఇరవై ఏళ్ళ పాటు నిరంతరంగా కదులుతూ కూడా విరిగిపోకుండాను ఊడి పోకుండాను వున్నా గంటల ,నిమిషాల , సెకండ్ల ముల్లు లే మనకు వాచీ పని తీరును దాని గొప్పతనాన్ని తెలియపరుస్తున్నవి [] మనకే తెలియకుండా మనము ఆ ముళ్ల పనితీరునుమెచ్చుకుంటున్నాము [] మనకు తేలికగా కనిపించే గడియారపు ముల్లుల తయారీకి ఎంతో సాంకేతికత నేయిపుణ్యము అవసరము [] మన అమితాభుడు సీకో వాచీలతో వుండే ముల్లుల తయారీలో సిద్ధహస్తుడు- నిపుణుడు []

మెదడు జబ్బుల మైక్రో సర్జరీ లో అగ్రగణ్యుడు ఐన ఒక డాక్టర్ గారు వున్నారు [] అయన ఒక్కొక్క సారి ఆర మిల్లీ మీటర్ అనగా ఒక మామూలు దారపు యొక్క మందము ఉన్న నరాలను కత్తిరించి తిరిగి కలిపి కుట్టవలిసి ఉంటుంది [] వీటికి తగిన మైక్రో సర్జికల్ సూదులుఇంకా అందుబాటులోకి రాలేదు- ఎవరూ తయారు చేయటం లేదు - కారణం ధర గిట్టుబాటు కాకపోవటమే [] ఒకపక్క మెదడు జబ్బుల బారిన పడిన పేషేంట్లు సరిఅయిన సర్జరీ జరగక మరణిస్తూ వున్నారు [] ఇలాంటి సందర్భంలో డాక్టర్లు తమకు కావాల్సిన పరికరం ఏమిటో వివరిస్తూ -

యూనివర్సిటీలకు ఉత్తరాలు రాస్తారు [] అక్కడ వుండే రీసెర్చ్ స్టూడెంట్లు ఆ అవసరానికి తగ్గ పరికరానికి రూపకల్పన చేసి డాక్టర్లకు అందుబాటులోకి తెస్తారు [] మన డాక్టర్ గారికి ఏమనిపించింది అంటే "ఈ ఆపరేషన్ల కి ఈ నా చేతివాచీలో ఉన్న సెకండ్స్ ముళ్ళు అంత చిన్న సూది ఉంటే సరిపోతుంది [] కానీ ఒక సెకండ్స్ ముల్లును ఒక సర్జికల్ సూదిగా మార్చమని మనము ఎవరిని అడగాలి ?" అని ఆలోచించాడు []
ఇందాక మనము చెప్పుకున్న అమితాభుడు గడియారం ముళ్ల తయారీలో అనుభవజ్ఞుడు మరియూ నిపుణుసు అయిన వ్యక్తి అని తెలుసుకొని అతన్ని కలుసుకుని తనకోరిక చెప్పాడు []అమితాభుడు బుద్ధభగవానుని బోధనలతో ప్రభావిత మైన వ్యక్తి [] address ది SARROW అండ్ ది worried అన్న మాటలు బుద్ధ భగవానుని యొక్క బోధనల సారమనిమొదటిగా ఇతడే అన్నాడు [] ఇతడు డాక్టర్ కోరికను బుద్ధభగవానుని దృష్టితో చూసి - అనగా నావల్ల కొందరి దుక్కము నివారణ అవుతుంది కదా అన్న ఆలోచన తో చూసి - డాక్టర్ అడిగిన సూదిని తయారు చేయటానికి పూనుకున్నాడు [] తన పొదుపు సొమ్మును పెట్టి మెషినరీ కొనుక్కున్నాడు []
చివరికి .0.03 MM SIZE సూదిని తయారు చేసాడు []ఇంత సన్నని సూది చేతుల్లో పట్టుకున్నప్పుడు నరాలను కలిపి కుడుతూ వున్నప్పుడు పుటుక్కున విరగకూడదు . [] ఇంత సన్నని సూదికి ఇంకా మరింత సన్నని SHARP POINT ఉండాలి [] ఇదీ ఈ సూది తయారీలో వున్నా ఛాలెంజ్ [] సూది ముల్లు నరాలమధ్య విరిగి పోరాదుకదా ? అందుకని ఎంత సన్నగా సాగ తీసినా. , ఎంత సన్నని ములుకు పెట్టినా విరిగి పోనటువంటి ఒక కొత్త మిశ్రమ లోహం కనిపెట్ట వెలిసి వచ్చింది [] కొన్న మెషినరీ ఖర్చు, కరెంటుఖర్చు , పరిశోధనల ఖర్చు తన జీతం క్రింద కొంత అని లెక్క చూసుకొని - ఒక సంవత్సరం మొత్తము మీద ఒక ఇరవై వేల సూదులు అమ్మ గలము అనుకుంటే ఒక్కొక్క సూది ధర ఫది వేల రూపాయలుగా నిర్ణయించ వలసి ఉంటుంది అని లెక్క తేలింది [] మరి సూది ఆ డాక్టర్ అనుకున్న విధంగా లేకపోతే అమితాభుడికి అంతా నష్టమే కదా ? అతడి వృథాప్య జీవితం కష్టాల పాలు అవుతుంది [] కానీ అమితాభుడు బాగా అలోచించి " నేను బుద్ధ భగవానుడు చూపిన దారిలో పయనిస్తాను, ఒకరి దుఃఖ నివారణకు నావంతు కృషి నేను చేస్తాను " అని నిర్ణయించుకొని, ఆ మైక్రో సర్జెరీ సూది ధరను కేవలం ఒక వంద రూపాయలుగా నిర్ణయించాడు [] ఈ సూది మైక్రో సర్జరీలో అమోఘంగా ఉపయోగపడి డాక్టరల మన్నన పొంది నది [] అందరూ దీనిని మెచ్చుకొని ఉపయోగించుకోవటం మొదలు పెట్టారు [] సూది తయారు చేసిన అమితాభుడి మనసులో ఉన్న " దుఃఖాన్ని ఉద్దేశించి జీవించండి- దుఖఃహిస్తూ వున్నా వారిని ఉద్దేశించి జీవించండి " అన్న ఆలోచన తక్కువ ధరలో సరి ఐన సూది వైద్యరంగము వారికీ , తద్వారా ప్రజలకు మరింత వైద్యం అందుబాటులోకి వచ్చింది [] సరి ఐన సూది లేని కారణంగా డాక్టర్లు వాయిదా వేస్తూ వచ్చిన ఆపరేషన్స్ అన్నీ ఈ సూది తయారు అయినా తరువాత నలబై వెలవరకూ జరిగాయి -- మరి ఇతడి కారణంగా నలబై వేలమంది శోకము నుండి విముక్తులు అయినట్లే కదా ? ఇతడు తయారు చేసినదే కాకపోయినా దానికి సరి సమానమైన సూదిని చూపించే ఫోటో ఒకటి ఇచ్చాను [] పరిశీలించండి []
[][][][][]
ఇంతకు ముందు వరకూ - నేను ఏమనుకుంటూ వుండే వాడిని నంటే చక్కని కంటి చూపు కలిగిన నర్సులో . డాక్టర్ లో ఆపరేషన్ లలో వాడే సూదులకు దారము

ఎక్కించి పెడతారని .[] దారము ఎక్కించే విధం మన ఇంట్లో మనం సూదిలోదారము ఎక్కించిన వివిధంగానే ఉంటుంది గాబోలు అని [] . మనం సూదిలోకి దారము ఎక్కించి కుడుతూ చున్నప్పుడు . ఒక్కొక్క సారి దారము - సూది బెజ్జము లోనుండి జారి వచ్చి వేస్తూ ఉంటుంది . ఇలాంటిదే ఆపరేషన్ టైములో జరిగితే ఎట్లా ?ఏమిటీ ? అన్న ప్రశ్న వేసుకోండి ?దీనికి జవాబుగా --చివరికి తెలిసింది ఏమిటంటే కొన్ని రకాల మైక్రో సెర్జరీ సూదులకు కంపెనీ వారే దారం ఎక్కించి ఇస్తారు - ఈ సూదులకు దారం ఎక్కించేటందుకు చివరినా ఒక బెజ్జము ఉండదు [] దానికి కి బదులు సూదిలోనే నిలువుగా ఒక కన్నము వంటిది వేసి అందులోకి దారము పెట్టి - యంత్రాల సాయంతో సూది ని గట్టి గ నొక్కి దారాన్ని బిగించుతారు [] అపుడు ఎంత గుంజినా కానీ సూది నుండి దారము విడి పోయి రాకుండా ఉంటుంది [] FUN కోసము ఆపరేషన్ మధ్యలో సూదిలోని దారం ఊడి రావటం - అప్పుడుడాక్టర్ గారు ఆపరేషన్ సగంలో పక్కన పెట్టి, ఒక మూలకు వెళ్లి సూదిలో దారం ఎక్కించుకుంటూ ఉండటం గురించీ ఊహించండి[] కనపడతాడు []

పలు రకాల కోణాలనుండి అందిన ఈ సమాచారాన్ని ఒక వ్యాస రూపకం గా మీకు అందించిన వాడు వారణాసి శ్రీ రామ కిష్ణ అఫ్ అమరావతి

పార్వతీశం 23-05-22

ఇంటర్నేషనల్ ఫిలిం ఫెస్టివల్ అనేది ఒకటి జరిగినట్లుగానే , ఇంటర్నేషనల్ ఫుడ్ ఫెస్టివల్ అనేదే ఒకటి లండన్ లో జరుగుతూ వుంది [] వారు ఎవరో వచ్చి "అయ్యా పార్వతీశంగారు - మీకు ఇంతకు ముందు ఇంగ్లాండ్ పోయి అక్కడ అందరిని ఖంగు తినిపించి వచ్చిన అనుభవం మీకున్నది -ఇప్పుడు మీరు ఆ ఫుడ్ ఫెస్టివల్కి మన దేశం తరప్పున అందునా ఆంధ్రా తరప్పునా అందునా మన గుంటూరు జిల్లా తరప్పునవెళ్లి , ఏదన్నా ఫుడ్ ప్రదర్శించి. అక్కడి వారందరిని ఖంగు తినిపించి బెస్ట్ ప్రైజులు కొట్టుకు వస్తే మనము పూరా ప్రయోజకులము అవుతాము " అని అడిగారు [] మన ప్రయోజకత్యం ఇన్నాళ్లకు లెక్కలోకి వచ్చింది గదా అని నేను వెంటనే ఏర్పాట్లు మొదలు పెట్టాను [] అటక మీద వున్నా పాత ఇనుప ట్రంకు పెట్టెను బయటకు లాగాను [] అది మా మాతామహుల వారు మా అమ్మకు ఇవ్వగా - మా అమ్మ నుండి నాకు సంక్రమించింది [] అరవై డెబ్బది ఏళ్ళ వయసు వచ్చిన పెట్టె నే అయినను - బహుగట్టిది []
పై పెట్టెలో ఒక కుంపటి , కొన్ని బొగ్గులు కొన్ని తాటి ఆకు ముక్కలు , ఇంకనూ మనకు అవసరమన్న సామానులు దినుసులు అవీ వేసుకొని ఆ పెట్టెను విమానం లో ఎక్కించి దానితో పాటు నేను - అనగా ఇరువురము క్షేమంగా లండనులో అడుగుపెట్టి ఫుడ్ ఫెస్టివల్ జరిగే ప్రాంగణంలోకి ముందుగా కుడికాలు పెట్టి ప్రవేశించాము [] అక్కడా మనమంటే ఎవరికీ ఖాతిర్ లేదు [] నాలుగు వందల ఆరు ఫుడ్ స్టాల్స్ - నాలుగు వందల్ల నాలుగు నెంబర్ ఆంధ్రులపుడ్డు కు కేటా యించారు [] మనము ఈ స్టాల్లో ప్రవేశించి - మనదైన ఒక వంటకం అక్కడనే వండి - చక్కగా ప్రదర్శించాలి [] జడ్జీలు వచ్చి మార్కులు వేస్తారు[]బహుమానాలు

ఇస్తారు [] స్టాల్ ఆక్రమించినాక ముందుగా నేను నా కుంపట్లను బయటికి తీసాను [] ముందుగా చెపితే మీరు ఏమంటారో అని మీకు చెప్పలేదు కానీ నేను జోడా కుంపట్లు తెచ్చాను [] వాటిలో బొగ్గులు వేసి , తాటి ఆకులను వెలిగించి వాటి సాయంతో బొగ్గులు రగిల్చాను [] ఈ పోకి రీలను ఖంగు తినిపించి ప్రైజు కొట్టాలని ముందునుండే మనకు వున్నదే నాయను []అందుకని ట్రంకు లోనుండి చాకలి వారు ఇస్త్రీ కోసం అని వాడే రొండు ఇస్త్రీ పెట్టెలు , అవీ బహు కొత్తవి రొండు తీసి రొండు కుంపట్ల మీదా పెట్టాను [] చాకలి వారు అయితే ఇస్త్రీ పెట్టెలో నిప్పులు వేస్తారు [] నేను కందిపప్పులు వేసాను [] కంది పప్పులు గుంటూరు జిల్లా లోను ను అందునా మా చేలో పండగా, మా అమ్మ వాటిని తిరగలిలో వేసి విసిరి ఇచ్చిన నాటు కందిపప్పు [] ఇక రొండో ఇస్త్రీ పెట్టెలో, ముందు ఆలోచనతో వెంటతెచ్చుకున్న సోలెడు గేదె నెయ్యి పోసాను [] కుంపటి మీద ఉడికిన కమ్మని పప్పు వాసనకు - ఘుమ ఘుమ లాడే నేతి వాసనలు పిల్చి ఎక్కడెక్కడి జనమూ న జనం మా స్టాల్ చుట్టూ మూగారు []
ఏమి వండాము అన్నదే కాకుండా దాన్ని ఎల్లా పెట్టాము ఎల్లా ప్రెజెంట్ చేసాము అన్నది కూడా ఇక్కడ ముఖ్యమే [] నేను ముందుగా పప్పును ఉడికించిన ఇస్త్రీ పెట్టె పై మూత తీయటం , దానిలోనుండి ఒక గంటె పప్పు తీసి వచ్చిన వారి ప్లేటులో వేయటమూ , ఆపై టంగున మోత వచ్చేట్లుగా ఆ ఇస్త్రీ పెట్టె మూత మూయటం , తదుపరి నెయ్యి కాచిన ఇస్త్రీ పెట్టె మూత తీయటం అందులోనుండి ఒక మిల్లె నేయి తీసి పప్పు మీద చల్లి ఇస్త్రీ పెట్టె మూత టంగున మూయటము చేస్తూ వచ్చాను [] ఆ కుంపట్లు ఆ ఇస్త్రీ పెట్టె కుక్కర్లు , అందులో ఉడికిన కంది పప్పు - కమ్మని నెయ్యి అందరినీ ఆకర్షించింది [] మిగరపంచం స్టాల్ వాళ్ళు మన ప్రాయోజకత్వం చూసి ఖంగులు తినేశారు [] ప్రయిజు మనకే ఇచ్చారు - తెచ్చాను - ఎప్పుడన్నా చూపిస్తాను []
నేను ప్రపంచం దృష్టిని ఆకర్షించాను [] ఆయనెవరో జెర్మనీ అయన వచ్చి - నాకుంపట్లను వాటి మీదవున్న ఇస్త్రీ పెట్టె కుక్కరులను బహుదా మెచ్చుకొని - అలాంటివి తయారు చేసి ఒక అట్టపెట్టెలో పెట్టి - ఆ అట్ట పెట్టీమీద నాబొమ్మ వేసి అమ్ముకోవటానికి పర్మిషన్ అడిగాడు [] ఆ పర్మిషన్ ఇచ్చినందుకు గానూ నాకు నాలుగు కోట్ల డాలర్ల చెక్కు ఇచ్చాడు [] కంది పప్పు గురించి - నెయ్యి గురించీ ఎందరో ఎంక్వయిరీలు చేశారు [] భారత ఎంబసీవాళ్ళు లగెత్తుకు వచ్చి వాళ్లకు తగిన ఇన్ఫర్మేషన్ ఇచ్చారు [] నేను ఇంటికి వచ్చి పెట్టెను అటక ఎక్కించే లోపునే " గుంటూరు కందిపప్పు ఎక్సపోర్టింగ్ కార్పొరేషన్ " నుండి పెద్ద అధికారులు వచ్చి - నేను ఆ సంస్థకు హానరరీ డైరెక్టర్గా నియామకం అయినానని - నాకు కారు బంగ్లా అవీ ఇచ్చి నెలకు ఫది లక్షలు ఇస్తామని చెప్పారు - నా కారణంగా గుంటూరు కంది పప్పు- కావాలంటూ ప్రపంచం నలుమూలలనుండి ఇప్పటి వరకూ నాలుగు లక్షల కోట్ల టన్నుల ఆర్డర్ వచ్చిందని చెప్పారు [] వారు నాకు దండలు వేసి ఆటుపోగానే , ఇటుగా నేతి ఫ్యాక్టరీల వారు వచ్చి వాళ్ళ తయారీలమీద నా బొమ్మ వేసుకుంటామని - నేను విదేశాలలో తిరిగి వారి బ్రాండ్ నెయ్యిని అక్కడి పప్పు వినియోగదారులు వాడేటట్లు ప్రచార సభలు నిర్వహించాలని కోరి - మొక్కి మరీ మూడు కోట్లు ఇచ్చారు []
ఈ నా ప్రాయోజకత్వం తలుచుకొని దేశప్రజలు ఏమనుకున్నా గాని - చచ్చి స్వర్గస్థులై వున్నా మా నాయనగారు శ్రీ వారణాసి లక్ష్మీ నరసింహయ్య గారుఆనంద భాష్పాలు రాల్చి వుంటారు అనటంలో సందేహం లేదు []

# పెద్ద పిచ్చెమ్మ పెళ్లి

{వివాహ సంభంద విచిత్రాలు - ప్రహసనాలు-}.   మా అక్క ,  కొడుకు కోదండరామం  కోసము పెళ్లి పిల్లను వెతుకుతున్నాము [] ఆయన ఎవరో హైద్రాబాదు నుండి ఫోన్ చేసి మా వివరాలన్నీ అంటే మా పుట్టు పూర్వోత్తరాలతో సహా అన్నీ అడిగి తెలుసుకొని మాచేత వాట్సాప్ లు పెట్టించుకుని చివరికి ఒక ప్రొఫైల్ మాకు వాట్సాప్ చేసాడు [] మూడు నెలలుగా అయన నన్ను గిల్లటం ఆశకొద్దీ నేను తిరిగి నవ్వటం జరుగుతూ వస్తున్నది []  అదిగో ఇదిగో అని ఊరిస్తూ వున్నాడు [] అయన తమ్ముడి కూతురికోసం సంభందం వెతుకుతున్నాను అన్నాడు [] మా వాడి ఫోటో పెట్టించుకున్నాడు కానీ వారి అమ్మాయి ఫోటో పెట్టలేదు - అట్లా గని మమ్ము వదలలేదు []

చివరికి ఒకనాటికి వ్యవహారం ఇట్లా తేలింది అయన ఇట్లా చెప్పాడు " మా తమ్ముడు అకాల మరణం పొందాడు - అది మాకు నెత్తిన బాంబు పడ్డట్లు అయ్యింది [] మా తమ్ముడికి ఇద్దరు కూతుళ్లు [] ఇద్దరూ ఆణిముత్యాలు [] ఎప్పుడూ గుడులు ప్రదక్షిణాలు - నామ   స్మరణలు , దైవభక్తి గల పిల్లలు [] ఎన్ని పూజలు చేసినా తండ్రిని బ్రతికించుకోలేక పోయారు - వాడికి   గుండె జబ్బు [] తండ్రి మరణించగానే పెద్ద పిల్లకు పిచ్చి లేచింది  [] సరేలే ఒక సంవత్సరం లోపున ఒక పిల్లకు పెళ్లి చేసినా మంచిదే అని అలోచించి - ఆ రెండో అమ్మాయి కోసమని మీ సంభందం పరిశీలిస్తూ మీతో కాంటాక్ట్ లో వున్నాను [] అక్కకు పెళ్లి కాకుండా  నేను పెళ్లి చేసుకోను అని చిన్నది పట్టు బట్టింది [] మా మరదలు కూడా " పెద్దదానికి పెళ్లి చేసినాకనే చిన్నదానికి చేద్దాము అంటున్నది [] ఈ మూడునెలలో-  వైద్యం వల్లనైతేనేమి దేముడి చలవ వల్ల నైతే నేమీ పెద్దపిల్ల కాస్త కోలుకుంది మనలోకంలో పడింది [] మరి దానికి  పెళ్లికానిదే రెండోపిల్ల పెళ్లి చేయలేము కదా ? ]అందుకని ముందు  పెద్దపిల్లకు పెళ్లి చేద్దాము అనుకుంటున్నాము [] మీకు ఆ రెండో పిల్ల బదులు మా పెద్ద పిల్లను చేసుకోవటం ఇష్టమైతే చెప్పండి - జాతకాలు అవీ చూపించుకుందాము- మీరు పిల్లని జాగర్తగా చూసుకుంటే చాలు ఏమీ ప్రాబ్లెమ్ ఉండదు []  " అన్నాడు [] ఇంకా ఇట్లా అన్నాడు [] వారు అకట్నాలు కానుకలు ఇవ్వలేరు [] ఎదో పెళ్లి చేసి లాంఛనాలు జరిపిస్తారు [] ఖర్చులన్నీ నేనే భరించాలి మరి [] వాళ్ళ దెగ్గర ఏమీలేదు [] వాడు  చనిపోగా వచ్చిన డబ్బుతో వాళ్ళు ఇక్కడనే మా పక్కననే  ఈ ఎలిబీ నగర్లోనే ఓ  మంచి ఫ్లాట్ కొనుక్కున్నారు"  అని అయన ముగించాడు [] అయన లోపాయికారీగా . మేము  ఆ పేదపిచ్చమ్మ ను పెళ్లి చేసుకుంటే ఇక ముందురోజుల్లో ఆ పిల్ల వాటాగా , వున్న  ఫ్లాట్లో సగభాగం ముందురోజుల్లో కుర్రవాడికి లభించగలదని ఆశ చూపుతున్నట్లు తోచింది [] ఇకపై ఇంటి అల్లుడే అన్నింటికీ భాద్యత తీసుకోవాలని , ఆడవారి కోరిక కూడా అని మేము ఊహించాము  [] పెళ్లి జరిగితే - మానసికంగా దెబ్బతిన్న గాజుబొమ్మ లాంటి పెళ్లి కూతురు , మోయాల్సిన ఇంటిభాద్యతలు , కడతేర్చవల్సిన అత్తగారు - హాఫ్ ఫ్లాట్ మా వాడికి లభిస్తాయి  [] ఇందులో భాద్యతలు ముందూ ఆస్తులు చివర్లో ను వస్తాయి []

మమ్మల్ని ఏమి చేయమన్నారు ? మీరు చెప్పినసలహాను పట్టి పెద్దపిచ్చమ్మ పెళ్లి ఆధార పడి వుంది []

భూమి లేని వ్యవసాయం

ఇది నిజంగా అమలులోకి వచ్చిన టెక్నాలజీ [] . దీన్ని- నేను అర్థం చేసుకున్న విధంగా మీకు చెపుతాను [] మనం రోజూ వాడే పిల్లల డైపర్లు గుర్తు తెచ్చుకోండి [] పిల్లలు చేసిన తడిని ఆ డైపర్లలోని హైడ్రో జెల్ అనే పదార్థం పీలుస్తుంది [] హైడ్రోజెల్ అనే పదార్థమునకు పైపొరలో ఒక గుణము క్రింది పొరలో ఒక గుణము ఉంటాయి [] పై పొర పైనుండి వచ్చిన నీటిని క్రిందకు పంపుతుంది - కానీ అదేపదార్థపు యొక్క రెండోవ పొర కిందకు దిగుతున్న నీటిని నేల మీదకు వదలక లోపలనే బిగించి పట్టి ఉంచుతుంది [] ఇలాంటి శక్తి వంతమైన తత్వము గల పదార్థమును కేవలము పిల్లల పీతి ముడ్లకే పరిమితం చేయటమా ? లేక దీన్ని వుపయోగించి ఏదన్న లోక ఉపకారం చేయవచ్చునా ?అని - ఈ డైపర్ లకు సంభందించిన టెక్నాలజీ మీద ముప్పది యేండ్ల పాటు పరిశోధన జరిపిన ఒక జపాన్ శాస్త్ర వేత్తకుఆలోచన కలిగింది [] - ఆయన పేరు Yuichi Mori - [] ప్రపంచం లోని చాలా భూమి మార్పులు చెంది,సారం కోల్పోయి పంట దిగుబడులు తగిలిపోతూ - ఆ కారణంగా ఆహార ఉత్పత్తుల రేట్లు పెరుగుతూ - చివరకి పేదలకు తిండి దొరకటం కష్టం అవుతున్నదని అని అయన గ్రహించాడు [] - వారికీ -ఇంత ఆహారం దొరికే విధానం చూడాలని ఈయన డైపర్లను వదిలి వ్యవసాయ రంగంలో పరిశోధనకు దిగాడు [] డైపర్లలో వాడే హైడ్రో జెల్ ని ఎంతో సన్నగా సాగా తీసి ఒక కాగితంలాగా లాగ మార్చ వచ్చు [] అప్పుడు కూడా ఆకాగితం పైపొర నీటిని పీల్చుకుంటుంది అల్లాగే కిందపొర నీటిని ఆపి పట్టుకుంటుంది అని ఈయన తెలుసుకున్నాడు [] దీనికోసమే ముప్పది ఏండ్ల పరిశోధనా కాలాన్ని ఉపయోగించాడు [] చివరికి మనం పంక్తి భోజనాలలో డైనింగ్ టేబుల్ మీద పరుచుకునే కాగితం మాదిరి కాగితంతయారు చేసాడు [] దీన్ని ఫార్మింగ్ ఫిలిం పేపర్ అంటారు [] దీన్ని వృధాగా పడివున్న నేల, అనగా వ్యవసాయ యోగ్యం కానీ

భూమి మీద పరిచి - ఆ కాగితం పైన నీరు పోస్తారు - ఆ నీటిలోనే మొక్కలకు కావాల్సిన పోషకాలు కలుపుతారు [] ఈ నీరు పై పొరనుంది కిందికి దిగి , అక్కడనుండి రెండో పొర ద్వారా నేలలోకి వెళ్లలేక ఆగి పోతుంది [] ఇప్పుడు మొదటి పొరమీద టమోటో లాంటి విత్తనాలను చల్లితే అవి మొలకెత్తి తమ వేర్లను మొదటి పొరలోనుండి కిందకు దింపి - రెండో పొర దాటుకొని పోలేక - మొదటి మరియు రెండో పొర మధ్యలో వున్నా నీటిని పోష కాలనీ పీల్చుకంటూ - భూమి మీద పెరిగినట్లే చక్కగా పెరిగి చక్కని పంటనిస్తుంది []

ఈ టెక్నాలజీ వల్ల భూమిని దున్న వాల్సిన పని లేదు [] ఇసుక నేలలు, ఉప్పు నేలలు , చవిటి భూములు, బీడు భూములు కొండ భూములు, ఇలాంటి వాటిలో ఎక్కడైనా ఈ వ్యవసాయం చేయవచ్చు [] నేడు ఇది ప్రపంచ వ్యాప్తంగా విస్తరిస్తూ వున్నది [] దుబాయ్ దేశం ఈ ఫిలిం ఫార్మింగున్ను తమదేశంలో ప్రోత్సహిస్తూ

వున్నది [] ఈ వ్యవసాయం అమలులోకి వచ్చి , వ్యవసాయ యోగం కాకా వృధాగా పడివున్న భూమి కూడా ఉపయోగంలోకి వచ్చినప్పుడు ప్రపంచంలో అందరికీ తిండి దొరికే రోజులు రానున్నాయి [] ప్రస్తుతం ఈ టెక్నాలజీ వుపయోగించి మంచిక్వాలిటీగల టమోటాలు పండిస్తున్నారు ఎందుకంటే ప్రపంచంలో అందరూ వాడే కూరగాయ అదే కాబట్టి[] దానికే డిమాండ్ కాబట్టి [] ఎట్లా చెపితే అట్లా విని పెరుగుతుంది కాబట్టి []

నేను రాసింది నిజమో కాదో నిర్ధారించుకోవాలి అని ఉంటే - వాడని డైపర్ తీసి - దాన్ని నీటితో తడిపి దానిపై తోటకూర గింజలు చల్లండి [] దాన్ని గోడకు వున్నా మేకుకు వేలాడ తీయండి [] నాలుగు రోజుల్లో మీకుభూమిమీద పెరగని తోటకూర కట్ట తయారు అవుతుంది [] భూమి లేని వ్యవసాయం అంటే ఇదే [] దీన్ని గురించి ఒక ఫోటోపెట్టాను [] నేను చెప్పిన జాపనీస్ శాస్త్రవేత్త ఆయనే అని నా భావన [] ఫార్మింగ్ ఫిలిం మీద పెరిగిన మొక్కలను - ఆ ఫిల్మును తల్లకిందులుగా చేసినా మొక్కలు ఊడి కిందకు పడక పోవటాన్ని మనం ఆ ఫోటోలో చూడవచ్చు [] దీని అర్థం మొక్క అచ్చం భూమిలో నిలదొక్కుకొని వున్నట్లే ఈ ఫిలిం మీదకూడా నిలదొక్కుకొని ఉన్నదన్న మాట [] భారత దేశం లో కూడా ఇలాంటి వ్యవసాయం నడుస్తున్నట్లు ఇంటర్ నెట్ చూపుతున్నది [] ఇలాంటి విశిష్టమైన ఆలోచనలు చేయగల మరియు ఆ ఆలోచనలతో ముందుకు పోగల వ్యక్తులు భారత దేశంలో కూడా ఉద్భవించాలని కోరుకుందాము -ఎందుకంటే "అన్నమో రామచంద్రా అన్న స్లోగన్ మనదే కాబట్టి [] ఒక స్పూర్తి దాయక విషయాన్ని మీతో పంచుకోవటమే నా ఉద్దేశ్యము []విమర్శా వద్దు సార్ []

అడాప్టర్ మామయ్య

అడాప్టెర్ అంటే 240 వోల్టులకరెంటు నుంజి ఆరు వోల్టులో లేదా మూడు వోల్టులుగానో మార్చి ఏపనికి ఎంత విద్యుత్ అవసర పడుతుందో అంతే విద్యుత్ ను విడుదల చేసి విద్యుత్ పరికరాలను పని చేయించే సాధనం

మా మామయ్య జీతం ముప్పది వేలు - అనుకుంటే రోజుకు వెయ్యి వోల్టులు [] అయన పొద్దున్నే వెయ్యి రూపాయల శక్తితో బయలు దేరి తన అడాప్టర్ శక్తిని వుపయోగించి - పేకాటలో కొంత ,బారులో కొంత బెట్టింగులో కొంత ఇచ్చుకుంటూ {పోగొట్టుకుంటూ} వాటిని పనిచేయిస్తూ , సాయంత్రానికి ఇంటి ముఖం పడతాడు []

అప్పుడు కూడా అయన జేబీలో ఒక బిర్యానీ పార్సెల్ ప్లస్ మల్లెపూలు ప్లస్ జిలేబీకి అవసరమైన డబ్బులు - జేబులో మిగుల్చుకంటాడు [] ఇవి కొనటానికి ముందే రేపు పొద్దున్నే నిద్ర లేవగానే సిగిరెట్లకోసమని , టీ కోసమని గుట్కా కోసమని ఇంకొంచెం జేబులో మిగుల్చుకుంటాడు [] ఎంతో యెడాప్టివ్ శక్తీ ఉంటే గానీ ఇంత చేయటం సాధ్యం కాదు [] ఈ శక్తే లేక ,వున్నా డబ్బులు మొత్తం ఒక్క చోటే , అంటే ఆటలోనో / బారులోనో పోగొట్టుకుని - పొద్దునే లేచి బిక్క మొగం వేసుకుని పెళ్ళాము ముందు నిలబడే వారు అనేకులున్నారు [] వారి అందరికీ

మా మామయ్య ఆదర్శప్రాయుడు [] పాతిక ముప్పై ఏళ్లుగా జీవితాన్ని ఇలాగే నిష్పేచీ గా నెట్టుకొస్తున్నారు [] ఈ ఆదర్శ పురుషుడి గురించి మీకు తెలుపాలని తోచి రాసాను [] ఈ నాడు వున్నా భాద్యతా రాహిత్య పురుషులలో వందకు ఇద్దరు మాత్రమే మా అడాప్టర్ మామయ్య లాంటి వారు వుంటారు [] వారి గొప్పతనం వారిది [] పప్పులు ఉడకని ఎమ్మెల్యే ... సంగతులు

పూర్వపు ఈజిప్టు దేశంలో దేవుడి దర్శనం ఇల్లా ఉండేది [] మంచి పుణ్యమైన రోజు అనుకున్న రోజు నాడు గుడి పూజారి గారు - దేవుడి గుడిముందు నిలబడి ఏవేవో మంత్రాలు చదివి క్రతువులు చదివి చివరికి హాం ఫట్ అనంగానే ఆ గుడి కి వున్నా పెద్ద తలుపులు వాటి అంతటిగా అవే తెరుచుకునేవి . భక్తులు దేముని మహిమకు అబ్బుర పడుతూ లోనికి పరిగెత్తి దేమునికి ఇబ్బడి ముబ్బడిగా కానుకలు సమర్పించేవారు . ఇది ఎట్లజరిగే దంటే ' పూజారిగారు మంత్రాలు చదువుతూ ఉన్నంతసేపు - ఆయన శిష్యులు కొందరు బిందెలతో నీరు తెచ్చి గుడి తలుపుల ముందు వార పోసేవారు [] ఆ నీరు ప్రవహించి ఒక తొట్టె లోకి చేరేది [] ఆ తొట్టెలోని నీరు ఒక గొట్టము ద్వారా ప్రవహించుకుంటూ వెళ్లి ఒక పెద్ద గంగాళం లాంటి దాన్ని నింపేది . ఈ గంగాళం ఒక తాడు ద్వారా మరియు ఒకగిలక ద్వారా దేవాలయపు తలుపుకు కలపబడి - గంగాళం నిండిన బరువుకు ఆ తలుపు వెనక్కు గుంజబడేది [] దేవాలయం తలుపులు ముందు నిలబడి చూసిన వారికి ఇది పరమాద్భుతంగా తోచేది [] మనకు కూడా ఏడూ ద్వారాలు వుండటము అవి తెరుచుకుంటూ టీవీలో కనపడితే మనము పులకరించి పోవటము జరుగుతుందీ [] ఇలాంటి విషయాలు , మనదేశ ములోనికి ప్రవేశించిన యాత్రికుల ద్వారాల విన్న మన వారు - ద్వారాలు ఆటో మెటిక్ గా తెరుచుకోవటం అనేది మనుషులలో ఎంతో స్తే భక్తి భావము పొంగి పొరలిస్తుందని గ్రహించి , ఆపైన తామంతటా తాము తెరుచుకునే ఏడూ ద్వారాలను కథలను ఊహలను మన విని మన పురాణాల్లో చేర్చారు []

ఇకరొండోది - ఓకే పూజాగారి గారు ఒక గోరెనో బర్రెనో తీసుకు వెళ్లి దేమునికి బలి అని చెప్పి ఒక కొండా గుహముందు నిలపెట్టే వారు [] గుహలోనుండి సన్నని పాయగా నీరు బయటికి వస్తూ ఉంటుంది []కొద్దీ సేపటికి ఆ గొర్రె లేదా బఱ్ఱె చనిపోతుంది నిరపాయముగా బయటికి వస్తాడు [] మనము ఇచ్చిన బలిని దేముడు అంగీకరించాడు ఇక మనలను సంతోషంతో దీవించుతాడు - రండి కానుకలు సమర్పించి మొక్కండి అని ప్రకటిస్తాడు [] ఇందులో గొర్రె చనిపోవటానికి కారణం గుహలో నుండి వస్తున్నా నీటిలో విషవాయువులు వున్నాయి [] ఆ విష వాయువులు నీటి మీద ఒక రొండు మూడు అడుగుల ఎత్తువరకు ఆవిరి రూపంలో వున్నాయి . గొర్రె తల కిందకి వంగి ఉంటుంది కాబట్టి - అది విషవాయువులు పీల్చక తప్పని పరిస్థితులు ఏర్పడి , ఆ విషవాయువును పీల్చి చని పోతుంది . గొర్రె బదులు ఒక గుర్రాన్ని నిలపెడితే అది చావదు కారణం అది విషవాయువు కన్నా ఎత్తుగా ఉండటమే [] ఇదే కారణంతో పూజారి కూడా చావడు [] ఇది దేముని మహిమగా చలామణి అయ్యింది []

అప్పటి నుండీ బలి ఇవ్వటం ఒక అలవాటు అయ్యింది - దీనిని ప్రోత్సహించింది పూజారులు []

పై రెండు విషయాలు అనేక మార్లు డిస్కవరీ ఛానల్ లో ప్రస్తావించ బడినవి [] తెలుసు కోవాలన్న ఆసక్తి కలవారి కోసం నేను నా సొంత మాటలలో పై విషయాలు రాసాను []

పై విషయాలు ఆసక్తి కలిగించగా , నాకు నేనుగా కొంత ప్రాచీన చరిత్ర గురించి పరిశోధించాను [] ఆ విషయాలు క్రింద చెప్పుతున్నాను []

సమాజంలో పూజారుల ప్రాముఖ్యం పెరిగాక వీరు ప్రజాజీవితాలను అనేక విధాలుగా ప్రభావితం చేశారు [] అందులోది ఒకటి - ప్రజా స్వామ్య యుతముగా ప్రజా ప్రతినిధుల ఎంపిక [] ఇందులోఆలయ పూజారులు మనం రోజూ చూసేటటువంటి టీ కెటిల్ వంటి పాత్రను తీసుకు వచ్చి కుంపటి వంటి దానిమీద పెడతారు [] ప్రజా ప్రతినిధులుగా పోటీ పడదలుచుకున్న వారు వచ్చి ఆ కుంపట్ల ఎదురుగా నుంచుంటారు [] ప్రజలు జానెడు జానెడు వున్నా కర్రముక్కలను అగ్నిలో అంటించి , తమకు ఏ అభ్యర్థి ఇష్టమో ఆ అభ్యర్థి యొక్క కుంపటిలో వేస్తారు [] ఏ అభ్యర్థి యొక్క కుంపటిలో ఎక్కువా కర్ర పుల్లలు పడితే ఆ అభ్యర్థి యొక్క కెటిల్ లోని నీరు మరిగి ఆవిరి బయటకు వస్తుంది . ముందుగా ఏ అభ్యర్థి కెటిల్ లోనుండి ఆవిరి బయటికి వస్తుందో అతడు ప్రజా ప్రతి నిధిగా గెలిచినట్లు [] ఈ గెలుపులో మనుషుల పాత్రతో పాటు , అగ్ని దేముని దయ , నీటి దేవత దయ , గాలి దేవతదయాకూడా పాలు పంచుకున్నాయని మనం గ్రహించవచ్చు [] ఆవిరి బయటికి వెలువడగానే - అతడే దేముడు మరియు ప్రజలు నిర్ణయించిన ప్రజా ప్రతినిధి అని పూజారులు ప్రకటించే వారు [] ఇక దీనికి ఎదురు ఉండేది కాదు [] ఆనాటి కర్రముక్క న పోలిన కర్రముక్కను ఇప్పుడు కీ మనము ఎలక్షన్స్ ముద్ర వేయటానికి వాడుతున్నాము []

పై విషయము నా సొంత పరిశోధనా ఫలితము - అందువల్ల వివాదము చేయవద్దు []పై రకంగా ప్రజా ప్రతినిధిని ఎన్నుకోవటం తెలుసుకున్నాక మనదేశంలో కూడా అలాంటి ప్రెపు ఎన్నికలు పెడితే ప్రజలు ఇబ్బడి ముబ్బడిగా ఆసక్తితో ఓటింగ్ లో పాల్గొంటారని నాకు తోచింది [] నా వూహ ఏమిటంటే - ప్రతి ఎమ్మెల్యే అభ్యర్థికి ఒక చిన్న పప్పు కుక్కర్ ఇవ్వాలి [] దాన్ని ఒక కుంపటిమీద పెట్టాలి [] ప్రజలు వచ్చి కర్రపుల్ల ముక్కలు వెలిగించి తమకు ఇష్టమైన ఎమ్మెల్యే అభ్యర్థి కుంపటిలో వేయాలి [] పప్పు చక్కగా వుడికినాక కుక్కరు వీల వేస్తుందిగా ? అప్పుడు ఏ అభ్యర్థి యొక్క కుక్కరు ముందుగా వీల వేస్తుందో ఆ కుక్కరు దారుడు ఎమ్మెల్యే అయినట్లు . [] ఇల్లా చేస్తే ఇందులో ఓటరు దేముడి తో పాటు , నిప్పు నీరు గాలి వంటి నిజదేవతలు కూడా పాలు పంచుకున్నట్లు అయి - నెలకు దేవుడు దీవించిన ఎమ్మెల్యే దొరుకుతాడు [] ఇది అమలు జరిగినాక ,అంటే అంతా పారదర్సకంగా జరుగుతూ ఉండటం వాళ్ళ మనకు పప్పులు ఉడికిన ఎమ్మెల్యే లేదా ఎంపీ మరియు పప్పులు ఉడకపెట్టుకోలేని ఎమ్మెల్యే లేదా ఎంపీలు తేలికగా లభిస్తారు వెంటిలేటర్స

కరోనా టైములో వెంటిలేటర్స్ అనే మాట అందరూ విన్నారు . వెంటిలేటర్ల కొరతతో కొన్ని క్లిష్ట పరిస్థితులు ఏర్పడటం ప్రపంచము అంత అనుభవించింది [] కానీ ఈ వెంటిలేటర్స్ లో క్లినికల్ అంటే ఆసుపత్రిలో ఉపయోగించే మరియు ఇంటిలో ఉపయోగానికి పనికి వచ్చే వెంటిలేటర్ లను తగినన్ని ఎందుకు తయారు చేయ లేక పోయారు ? ఏ కొరత వల్ల వీటి తయారీ అవసరానికి తగ్గట్లు తయారు చేయలేక పోయారు ? ఇది ఒక ప్రశ్న అయితే దీనికి నాకు అర్ధం అయినా జవాబు ఇది

" వెంటిలేటర్స్ లో ఒక మోటార్ సహాయం ద్వారా ఆక్సిజన్ వాయువువునురోగి యొక్క ఊపిరి తిత్తులలోనికి ఎక్కిస్తారు . ఈ ఆక్సిజన్ ఎంత ఒత్తిడి తో ఊపిరి తిత్తులలో ప్రవేశించాలిసినది అనేది రోగి రోగికీ వేరు వేరుగా ఉంటుంది [] ఆక్సిజన్ అవసరానికి మించిన ఒత్తిడితో ఊపిరి తిత్తులలోకి ప్రవేశించినపుడు అది ఊపిరి తిత్తులను దాని మీదే పొరను పగలకొడుతుంది [] పిల్లలు ఎక్కవ గాలి వూదితే పగిలి పోయే బెలూనును ఇది పోలి ఉంటుంది []పంచ పెద్దల మాటల చద్ది మూట

పెళ్లి వాళ్ళ పిచ్చి వాట్సాప్
" అయ్యా అడగగా అడగగా మీ అమ్మయిప్రొఫైల్ మాకు పంపి మమ్ము మన్నించారు [] ఆ తరువాత , మా ప్రొఫైల్ చూసి మీరు ఏమి అనుకున్నారు అని అడిగె ధైర్యం మాకు లేకపోయింది [] మీరెట్లాగో , మేము ఏమనుకుంటున్నదీ చెప్పమని అడిగారు కదా అని నా మనసులోని మాటను చెపుతున్నాను [] ఆకలి గొన్న వాడికి మామూలు గృహస్థు మరియు అతని గృహమే దిక్కు [] విధి వశాత్తు నేడు వారు లేరు [] వూరు వదిలి హైదరాబాద్ వెడలిపోయారు []అక్కడ ఫైవ్ స్టార్ హొటల్ వంటి ఇల్లు కట్టుకున్నారు [] ఫైవ్ స్టార్ హొటల్ ముందు ఏమి బిక్ష ఏమిదొరుకుతుందో అలాంటిదే , మీ ఇంటిముందు కన్యా దానం అం కోరి నిలబడిన వారికి - మాకూ అదే దొరుకుతుంది [] మీసెక్యూరిటీ గార్డులవంటి మీ జాతకాల గన్నులు చూపి మమ్ము మీ వంక చూడ నివ్వవు [] జాతక చెక్కర వీరులు మీకు అతి గౌరవ మర్యాదలు ఇస్తూ మిమ్మలను లోకంలోని వెలుగు చూడనివ్వరు [] మీకు హారతి వెలుగులు తప్ప వేరొకటి రుచించవు [] చివరాఖరికి పదార్థాలు చల్లారి పోయాయని , పాచి పట్టి పోయి సమస్యగా తయారు అయ్యాయని గుర్తించాక , ఊరికే పారవేస్తే మనకేమి పుణ్యం ? అని ఆలోచించిన వారై మీరే రోడ్డు మీదకు వచ్చి రిక్షా వాళ్లను ఆటోవాళ్ళను గౌరవించి వారికి సగౌరవంగా భోజనం ఆఫర్ చేస్తారు [] ఇల్లాంటి ఘడియల్లో మేముకూడా మీనుండి కన్యాదానం అనే భోజనము ఆశిస్తాము [] ఇప్పటికి మమ్ము క్షమించండి [] మీరు మీ డిమాండ్స రిక్వైర్మెంట్స చల్లారిన దాకా మీ వంక చూడటానికి మాకు ధైర్యం లేదు []

గెస్ట్ రైస్ 02-05-22
నేనూ మా పక్క పోర్షన్ లో వున్నా ఇందుమతిఅనే అక్కగారితో కూచొని బాతా కానీ కొడుతున్నాను [] ఆమెను నేను అక్కగారూ అని సంభోదించుతాను ,

గౌరవించుతాను కానీ ఆమె నాకు నిజముగా అక్క కాదు [] ఈ రోజుల్లో నా భార్య వారము నుండీ ఆసుపత్రిలో వున్నది [] హొటల్ తిండి హాస్పిటల్ కాంటీన్ తిండి నాకు డోకు వస్తూ వున్నాయి [] ఈ అక్క గారితో ఇలాగేబాతా ఖానీ వేసుకుంటే నిమ్మదిగా లంచి అవర్ సమీపించదా ? , భోజనానికి అని వాళ్ళ అయన రాడా ? ఆయనతో పాటు నాకు కూడా భోజనం పెట్టదా? ఇంకొంచం సేపటి కైనా మా అక్క గారు లేచి వెళ్లి కుక్కరు వేయదా ?బియ్యం నాకు కూడా కొలిచి పోయదా ? నన్ను భోజనానికి ఉండమని అనదా? మరి అంత ఆదర్శ గృహిణియా ? అని ఆలోచిస్తూ నేను ఏవో మాట్లాడుతూ వున్నాను []నేను భోజన్నానికి ఉండి పోయేటట్లు వున్నానని ఆమె భయపడుతూ ఉన్నట్లు ఆమె కళ్ళల్లో ని బెరుకు వల్ల తెలుస్తూనే వుంది . సరే ఎవేరి పట్టు వారిది ?? నేను మొండికి పడి కూచున్నాను
ఇంతలో ఎవరో తలుపు కొట్టారు [] పంచా , లాలీచీ , భుజాన ఉత్తరీయం , నుదుట బొట్టు వెనుక బ్యాక్ ప్యాక్ తో ఒక కుర్రవాడు వచ్చి వున్నాడు [] "రండి "అని అక్కా అతనిని మర్యాదగా ఆహ్వానం చేసి కూచో పెట్టింది [] అలాంటి కుర్రవాడిని మర్యాద చేయక పోతే ఎవ్వరి మనస్సైనా ఊరుకోదు . గొప్ప హఠం చేస్తుంది [] అతడు ఆసీనుడై " అమ్మా అతిధి దెవొ భవ అన్నారు.అతిధి అభ్యాగతులకు భోజనం సమకూర్చటం - హిందూ ధర్మానాన్ని నిలబెట్టు కోవటం గురించి మనం మాట్లాడు కుందాము " అం ప్రారంభించాడు . అక్క స్ప్రింగ్ అల్లే లేచి " మీకు మా ఇంట్లో భోజనం ఏమాత్రము వల్ల కాదు. మా ఇంట్లో ఉదయం ఎనిమిది కల్లా మా ఇద్దరికీ అని కుక్కర్ వేస్తాను . పప్పువండాను ఫ్రై చేసాను " అని త్రీవ్రంగా ఎదురు స్పందించింది [] సరే ఇప్పుడు నా సంగతి తేలిపోయింది []
అతడు ఇట్లా అన్నాడు " అమ్మా అనుకోని అతిధి వస్తే మీరిలా స్పందించటం మామూలు విషయమేను [] సెన్సెస్ ప్రకారం నూటికి .99 శాతం గృహిణులు ఇలాగే చేస్తూ వుంటారు . ప్రజలను మరియు "అతిధి దెవొ భవ " అనే హిందూ సమాజ " ధర్మాన్ని కాపాడాలని మా ధార్మిక సమస్త కంకణం కట్టుకున్నది [] మా హెడ్ క్వార్టర్స్ అమెరికాలోను ఇంకా ఆస్ట్రేలియాలోని వున్నది [] మేము అక్క డా అనేక పరిశోధనలు చేసి ఒక వెరైటీ రైస్ కనిపెట్టాము [] గెస్టు రైసు అని పేరు పెట్టాము [] ఇవి మీరు రు తినే బిర్యానీ రైస్ కన్నా తక్కువ రేటు, ఎక్కువ క్వాలిటీ [] [] మీరు మా బియ్యాన్ని మరియూ ,మా కూర ముక్కలనీ అనగా దుంప క్యారెట్ అండ్ బీన్స్ కూరల ముక్కలు , గిన్నెలలో వేసి నీరుపోసి మేము ఇచ్చిన లిక్విడ్ జత చేయాలి [] నిమిషంలో బియ్యేము అన్నముగాను కూరముక్కలు కూరలు గానూ మారిపోతాయి [] మీరు వాటిని గంటెతో తీసి కంచము లో పెట్టేలోగా. గాలిలోని మోనాక్సయిడ్ వాయువులతో చర్య జరిపి 100 డిగ్రీలు వేడి పడి ఆవిరి పొగలు పొగలు కక్కు తాయి [] నిమిషం లోపల వేడి వేడి భోజనం రెడీ అవుతుంది [] అతిధిని చూసినప్పుడు మీ మనస్సు గాభరాయించదు [] ¡ఈ స్పెషల్ క్వాలిటీ రైస్ కి మీరు ఎమన్నా ఆర్డర్ ఇస్తారా? ఏమని అడగ టానికి వచ్చాను అని అతడు ఒక ఆర్డర్ బుక్ బయటికి తీసాడు [] అతిధి కి భోజనం ఇచ్చి గౌరవించాలని మా అక్కకు ఏ డొక్కలోను లేదు [] ఏవేవో డౌట్స్ వెలిబుచ్చింది [] చాల ప్రశ్నలకు అతడి ఆన్సర్ ఇది "వచ్చిన అతిధి తక్కువ తిన్నా , లేక అర్గేంట్ పని తగిలింది అంటూ తినకుండానే వెళ్లి పోయినా మీరు భాద పడవలసింది గాని నష్ట పోవలసింది గానీ ఏదీ లేదు అదెట్లాగంటే , ఒక సారి ఉడికిన గెస్ట్ రైసు మరియు కూరల మీద చల్లని ఫ్రిజ్జు నీళ్లు చల్లి మేమిచ్చిన లిక్విడ్ వేస్తే - తిరిగి అన్నము బియ్యము గాను కూర కూరగాయ ముక్కలుగాను అచ్చము వెనకటి వాటి వల్లే

తయారు అవుతాయి [] మీరు తిరిగి తిరిగి మళ్ళా మళ్ళా వాడుకోవచ్చు , మా ప్రోడక్ట్ వల్లమీకు పైసా నష్టము ఉండదు అని చెప్పాడు []
అన్నము తిరిగి బియ్యము కాకా పోతే " బయ్ బ్యాక్ ఆఫర్" ఉందన్నాడు []ఇప్పుడు టెన్ పెర్సెంట్ డిస్కౌంట్ ఉందన్నాడు []
" ఆంధ్రులు తమ అతిధులకు కాదనకుండా ఇంత ముద్దా పెట్టటానికి అని సంకల్పించి ఆ దేముడు ఇలాంటి ప్రోడక్ట్ తయారీకి ప్రేరేపించి ఉంటాడు అని నేను అనుకున్నాను []
" ఆ ఫ్రిజ్యా డోర్ తీయటం వేయటం ఎవరు చేస్తారు చెప్పండి ? అని మా అక్క అడిగింది []
మీకు ఇప్పుడు ఏమితెలిసింది ? ఆ బియ్యము అనగా ఆ గెస్ట్ రైసును నేనే కొనుక్కుని ఆరోజుగడుపుకున్నాను [] తినగా మిగిలింది వెనకటి రూపానికి మార్చుకున్నాను[]ఐదు కేజీల బియ్యానికి ఆర్డర్ ఇచ్చాను [] భలే ఉందా నా పని []